# గీతగోవింద కావ్యము

సంస్కృతము

'శ్రీ జయదేవ కవి'

ఆంధ్రీకరణము

విద్వాన్ యల్. నారాయణ, ఎం. ఏ.,
లెక్చరర్, ఆంధ్రశాఖ,
ప్రభుత్వ కళాశాల,
అనంతపురం.

ప్రథమ ముద్రణ
ప్రతులు 1000
మార్చి 1982



ప్రచురణ : లక్ష్మి ప్రచురణలు,
మూల్యము : 12/- రూ.

ప్రతులకు :

శ్రీమతి యల్. లక్ష్మిదేవి
W/o యల్. నారాయణ
లెక్చరర్
1/365 పి 5 2వ రోడ్డు
అనంతపురం - 515 004

ముద్రణ : శారదా ప్రింటింగ్ ప్రెస్
అనంతపురం.




THIS BOOK IS

PUBLISHED WITH THE FINANCIAL ASSISTANCE OF

TIRUMALA TIRUPATI DEVASTHANAMS

UNDER THEIR SCHEME

AID TO PUBLISH RELIGIOUS BOOKS

"ఈశానాం జగతోఽస్య వేంకటపతే ర్విష్ణోః పరాం ప్రేయసీం
తద్వక్షస్థల నిత్యవాసరసికాం తత్క్షాంతిసంవర్ధినీమ్
పద్మాలంకృత పాణిపల్లవయుగాం పద్మాసనస్థాం శ్రియం
వాత్సల్యాదిగుణోజ్జ్వలాం భగవతీం వందే జగన్మాతరమ్."

## "పింఛ సౌందర్యం"

యది హరిస్మరణే సరసం మనో
యది విలాస కళాసు కుతూహలం
మధుర కోమల కాంత పదావలీం
శృణుతదా జయదేవ సరస్వతీం.

జయదేవకవి గీర్వాణ పదసాహిత్య చక్రవర్తి. కృష్ణకథాపథానువర్తి. అతని నాలుక కోమలకాంత పదావళీ మధురం కాగా - మనస్సు మాధవకథామధురం. లీలాశుకుని కృష్ణకర్ణామృతం కృష్ణభావనకు నీలమణిమయస్తంభాభిరామమైన కావ్యశాసనం. జయదేవుని గీతగోవిందం కృష్ణభావనాభివ్యక్తి కెత్తిన పదసంధాన మాధురీ జయపతాక. ఆపదాల కూర్పు ఒక మాయాజాలం. గోపబాలుని శబల పింఛాభిరామం. శూన్యంలో మణిసౌధం. ఇందుకే కవి తన కవిత 'మధురకోమల కాంతపదావళి' అన్నాడు. పదావళి శబ్దం దండి చెప్పిన 'ఇష్టార్థ వ్యవచ్ఛిన్నా పదావళీ కావ్యం— అన్న నిర్వచన వాక్యం లోది పదాల సమూహం వాక్యం. పదాల మధ్యఒక ఎడతెగని కూర్పు రచన ఉండాలి. ఇది ఛందస్సాధ్యమే. ఆ రచనపూర్వాపర పదసామరస్యం కలదే తప్ప దేనికది విడివిడిగా పొడిపొడిగా వుండేదికాదు. పూర్వపదం పరపదంలోకి ఇది దానిలోకి చొచ్చుకొనిపోవాలి. ఈ పదాశ్లేషచేత ఒక మాధుర్యం పుడుతున్నది. ఇదే వాగర్థిస మన్నాడుదండి అంటే పదం వర్ణగుచ్ఛం. ఏకస్థాన జన్యాక్షర సంపుటితో పదం గుచ్ఛమౌతున్నది. భిన్న స్థాన జన్యాక్షరాల మధ్య సామరస్యం లేదు. ఏకస్థాన జన్యాక్షర సంపుటి ఏకైక నాదగంధ సమున్మేషం. సమీపస్థాన జన్యాక్షర సంపుటిలోనూ ఇదిసాధ్యమే. చిత్రలేఖనంలో అన్యోన్య సామరస్యం కల వర్ణవిన్యాసముంటుంది. ఈ వర్ణసామరస్యమే ఆస్వాదనకు ద్వారం. ఒక పూలమాలలో పుష్పాలు ఏ విధంగా పరస్పర వర్ణసమన్వయం పొందు తున్నాయో-అలాగే కావ్యవాక్యమున్నూ అప్పుడొక ఏకైకనాదం జనిస్తున్నది శబ్దప్రపంచమంతా గిఱ్ఱున మహావేగంతో సుడి తిరుగుతూ-తిరుగుతూ పోయి ఒక మహా మధురనాదంగా పరిణమిస్తున్నది. మనోవృత్తులన్నీ ఆ నాదంలో లీనమై పోతున్నాయి. నీ మనశ్చలనానికదొక ఆలానస్తంభం. అదొక కృష్ణమౌళీ మనోజ్ఞమైన శబల వర్ణ

పింఛం. ఒక ఇంద్రధనుస్సు ముక్క. కేవల శబ్దం చేతనే మహాకవి ఇంత సాధిస్తున్నాడు. దీన్నే రాజానక కుంతలాచార్యుడు 'సువర్ణ విన్యాస, వక్రత'- అనీ నన్నయ భట్టు 'అక్షరరమ్యత' అనీ అన్నారు- జయదేవ కవీంద్రవాణి మధుర కోమలకాంత పదావళి- అంటే అర్థమిదే-

వసంతే వాసంతీ కుసుమసుకుమారై రవయవైః
భ్రమంతీం కాంతారే.........
అమందం కందర్పజ్వర జనిత-
చలద్బాధాం రాధాం.

లలిత లవంగలతా పరిశీలన కోమల మలయసమీరే
మధుకర నికరకరంబితకోకిల కూజిత కుంజ కుటీరే
విహరతి హరిరిహ (పుట 14)

1 వసంతే వాసంతీ 2 కుసుమ సుకుమారైః 3 సుకుమారై రవయవైః 4 భ్రమంతీం కాంతారే 5 అమందం కందర్ప 6 జ్వరజనిత 7 బాధాం రాధాం.

ఇవి పదగుచ్ఛాలు. పదావళులు. వానికూర్పులో ఏకాక్షరం అనేకసార్లు ఆవృత్తాలు కావటంచేత వసంతే-వాసంతీ, వ-వా. సం-సం. తే-తీ ఇలాగా పరస్పర ఘర్షణ కలిగి దానినుండి ఏకనాదం సుడితిరుగుతున్నది. అదొక సంగీతావర్తం ఇది విరామసమున్మేషం అంతే.

లలిత లవంగ లతాపరిశీలన- లలిత-లవంగ-లతా-పరిశీలన. ఇలా పదాలు విశ్రాంతి పూర్వకంగా ప్రయాణించటం ఒకే వేగంతో పదావళి దూకుతూనడిస్తే ఏకాక్షర వృత్తి జుగుస్సాహేతువై కేవల శబ్దాలంకార ప్రాయమై పోతున్నది. కవికిది సప్రయత్న జన్యం. వర్ణవిన్యాసవక్రత అప్రయత్న సిద్ధం. అతని భావనా మాధుర్య ప్రవాహం నాదైకతాన బుద్బుదావర్తాలుగా-యథోచితంగా-సహజంగా పొటమరిస్తున్నది. ఇందుకే ఇది వాగ్రసం. నాదమాధుర్యం పదసాహితికిది మాళిపింఛం.

'ప్రాతర్నీలనిచోళ మచ్యుత మురస్సంవీత పీతాంశుకం' (పుట 98) శ్లోకం వస్తురసయోగ్యమైన వుదాహరణ-

రాధామాధవసంయోగం ధ్వనిస్తున్నది. రాత్రి గడిచింది. తెల్లవారింది. వారిద్దరు పరస్పర వస్త్రాలు మార్చుకొని కట్టుకొన్నారు. వారికది తెలియక జరిగింది చెలులు చూచి నవ్వారు. సిగ్గుకళ్ళతోడి రాధను చూచి కృష్ణుడు స్వాదుస్మేరాననుడైనాడు.

ఇది ఉదాత్తశృంగార చిత్రణ. వస్త్రవినిమయం రసపరిధినిదాటి తాత్త్వికసీమల్లోకి-ఆపినా ఆగకుండా-ఎగిసిపోతున్నది. వస్త్రం ఆవరణ. శరీరం దిగంబరత-స్వచ్ఛాత్మలా సంకేతం. కేవలాత్మస్థితిప్రతీక. శివుడు దిగంబరుడంటే ఇదే. రాధ శివుడనీ మాధవుడు పార్వతి అనీ పురాణోక్తి. ఇక్కడ శైవ ద్వంద్వంగా చెప్పినా స్త్రీ-పుంభావ ద్వంద్వం యథేచ్ఛాసంభవ మౌతున్నది. ఒకటే రెండుగా జన్మిస్తున్నది. వస్త్రం భౌతిక శరీర సంకేతమై-తద్వినిమయం స్త్రీ-పురుషభావ వినిమయత్వానికి సంకేత మౌతున్నది. అంటే అక్కడ స్త్రీ-పురుష భేదభావన లేదు. లీలామయంగా క్రీడిస్తు న్నది. ఇదివైష్ణవతాత్త్వికభావన, ఇందుకే జయదేవకవి అన్నది- 'యది హరిస్మరణే' ఇత్యాది-హరిస్మరణేచ్ఛఉండాలి. లేని వానికంతా ఒక ప్రాణాంతకమైన సుడిగుండం. ఉన్నవారికంతా నాదమయావర్తం.

ఇక్కడ హరిస్మరణ - కృష్ణకర్ణామృతంలోని

'చేతో మదీయ మతసీ కుసుమావభాసం-స్మరతి' అన్న మాటను ఆక్షేపిస్తున్నది. చేతస్సు దానంతటది శ్యామలాంగుని స్మరిస్తున్నది. స్మరణ మరచిపోయినదాని చింతన తెలియనిదాన్ని గురించి ఆలోచించటమెలాగా? ఈ స్మరణ అలౌకికం. 'ప్రజ్ఞానం బ్రహ్మ'- అన్న మహా వాక్య విచారణ దృష్ట్యా చూడదగిందే తప్ప వ్యావహారిక దృష్ట్యా కాదు. ఈ స్మరణనీకున్నపుడు ఈ శృంగారతత్త్వం అవగతమౌతుంది. రాధ-పదార్థజగత్సంకేతం మాధవుడు బ్రహ్మచైతన్యం. ఈ రెంటి కలయిక రాసక్రీడ- అంటే జగద్భ్రమణం. జగత్తు కేవల పదార్థ రూపమూ కాదు. అసలు పదార్థమే లేనిదీకాదు. ఆత్మ-శరీరసమన్వయం జీవుడు. ఈ సామరస్యదృష్టి కేవల భౌతిక సృష్టికాదు. వ్యతిరిక్తమూ కాదు. సృష్టినీలాగే వుంది. అంతర్చైతన్యమూ వుంది. ఇదే కదలికకు హేతువు. ఈ దృష్టితో విశ్వమంతా లీలారాసక్రీడ. ఇదే మైథున శిల్పరహస్యం. హరిస్మరణచేత సరసమనస్సు ఏర్పడుతున్నది. లేక దానియందు అభిరమణప్రవృత్తి వున్నప్పుడు హరి కథాతత్త్వ రామణీయకత అవగాహితమౌతున్నది. కనక ఈ దృష్టి మనస్సు. దీని నుండి కళ జనిస్తున్నది. అదొక విలాసం. వైష్ణవవేదాంతంలో లీలా శబ్ద మొక పారిభాషికం. శాస్త్రీయం. విలాసమంటే లీల, పరమార్థదృష్ట్యా దర్శించదగింది. కాబట్టి

'విలాసకళాసు' కుతూహలముండాలి. రసికత-రసజ్ఞత, స్వానుతాభిరుచి-లేనివానికి కేవల భౌతికదృష్టి కలవానికీ-కేవలాధ్యాత్మికదృష్టి కలవానికీ కళలేదు. జీవితాన్ని సౌందర్య పరమార్థంలా చూచే దృష్టి పేరు కళ. అర్థికదృష్ట్యా చూడటంపేరే వ్యావహారిక-భౌతిక పదార్థదృష్టి, ఇదంతా ఏమీలేదను కోవటం పదార్థజగత్తు కల్పితమనుకోనేవాని వాదం. వాడికీ కళలేదు కళ విలాసమంటే ఈ జగత్తు పదార్థ చైతన్య క్రీడగా చూచే వైష్ణవ భావన-కవితా భావన. ఆమనస్సు ఆధారంగా పుట్టిన ఈకళాదృష్టి నీకుంటే జయదేవుని పదావళిలోని మాధుర్యం తెలుస్తుంది.

అంటే తన కావ్యశ్రోత ఈదృష్టి-తనదృష్టి కలిగి వుండాలి, కవి-శ్రోత లిద్దరూ సమాన మనస్కులూ-భావుకులూ కాకపోతే కావ్యం వారికి సంగమస్థలం కాదు. వారి ద్దరికది సంగమ స్థానం కావటంపేరే కవికీ-శ్రోతకూ సమానానుభవం కలగటం- అంటే రసానుభవం. ఇది లేక పోవటం చేతనే మైధునశిల్పం దుర్మేధావ్యాఖ్యాతిమై అపప్రథ పాలయింది. గీతగోవిందానికి అవింద తప్పలేదు, కాబట్టి కవిదృష్టితో చూడాలి.

ముఖర మధీరం త్యజమంజీరం
రిపు మివ కేళిషులోలం,
చలసఖి! కుంజం, సతిమిరపుంజం
శీలయ నీలనిచోలం— (పుట. 60)

'మంజీరాలను వదలి తిమిరపుంజమైన కుంజానికి పద, అభిసరించు నీలనిచోలం ధరించు'- ఈ భావం రాజస్థాన్ చిత్రంలో చిత్రితమైనది. ఆ బొమ్మనుచూచి ఇది వ్రాసాడాకవి ఇది చూచి అతడది చిత్రించాడా—అన్నంత సాదృశ్యంతో వున్నాయి. అంటే పాఠకుడు దీన్నిదానితో—దాన్నిదీనితో పోల్చుకొని చూడాలి. ఈ కళాదృష్టి— కవిదృష్టిలేకపోతే ఆపదం భావరహితమైన తొడుసులాగా తోచవచ్చుగదా! ఈ శృంగార భావదృష్టిలేని కేవల లౌకికునకది వ్యర్థంగా తోచవచ్చుగదా! కాబట్టి కవి దృష్టితోచూడు ఇంతేకాదు. చివరి సర్గంలో (పుట 130) 'కరకమలేన'—పదంలో 'శయనోపరిమామివ నూపురం క్షణము పకురు—శయ్యపై నూపురాలు ధరించమని కృష్ణుడు రాధను యాచించటంతో 140 పుటలో తిరిగి-సంయోగానంతరం-రాధకృష్ణుని ప్రార్థిస్తుంది 'పదే కురునూపురే'-దీనితోనూ ఆనూపుర విషయం ముడి పడిఉంది. ఈ మూడు మాట ల్లోను. వియోగ-సంయోగ శృంగార ప్రతీకాత్మత వుంది.

జయదేవ కవి శ్లోకరచన బంధకర్కశం. కూర్పులో పదాశ్లేష అధికం. దంతురమైన రచన. ఇందాక చెప్పినది పేశల రచన.

ఉన్మీల న్మధుగంధలుబ్ధ మధుపవ్యాధూత- (పుట. 18) ఇది అచ్చంగా భవభూతి రచన. ఈ రచన సర్గనామకరణంలోనూ వుంది.

ఇందులో ద్వాదశ సర్గలు, ద్వాదశస్కంధ స్మారకంగా శ్రీకృష్ణకథామూలం భాగవతమే కనక.

సామోద దామోదరంతో ప్రారంభమై సుప్రీత పీతాంబరంతో అంతమౌతున్నది. ఈ నామకరణం కూడా విలాసకళా విషయమే.

ఈ కావ్యాన్ని తెలుగుకవి అనువదించటం వర్ణనీయమే. అనువాదం చాల కష్టం. ఇది జగద్విదితమే. మూలంలోని వాగ్రసం- వస్తురసం- రెంటినీ అనువదించక పోతే మూలం- అనువాదం- వేరై పోతుంది. తెలుగులో వచ్చిన అనువాదాలన్నీ వేరై పోయినవే. వస్తురసానువాదం కుదిరిందే తప్ప వాగ్రసానువాదం చేయలేకపోయారు. ఇక్కడా అదే జరిగింది.

'ఉన్మీలన్మధుగంధ'— అనువాదం మసృణం, మూలం దంతురం. కాని కవి నేర్పుగలవాడు కనుక అందమైన తెలుగుమాటలతో - మావిమొగ్గలు - ఇత్యాదికంతో కప్పుకొన్నాడు.

'వసంతే వాసంతీ'— అనువాదం అసలు కుదరని విషయం. కనక కవి తేట మాటలతో తేటగీతి వ్రాసుకొన్నాడు. అంటే అనువాదం సరళసుకుమారం తప్ప వాగ్రసానుసరణం కాదు.

''రతిసుఖసారే గతమభిసారే - నకురు నితంబిని గమన విలంబనం' (పుట 58) దీన్ని అనుసరింపు గమన విలంబన మికేల' - అని కవి అనువదించడం సమంజసం కాదు. నితంబిని - విలంబన పదాల కూర్పులోని నాదమాధుర్యం పోయింది కనక అవే మాటలుపయోగించినా- వేరే మాటలుపయోగించినా అక్షరరమ్యత రాబట్టుకోవడమే అను వాదకుని కత్తి మీదిసాము.

'కేళి చలన్మణి కుండల మండిత'— (పుట 20) అన్నదానికి అనువాదం 'కేళి చలిత మణికుండలద్వయము'— సరిగాదు. అంటే భావానువాదం తప్ప శబ్దానువాదం

కాదది చలన్మణి— అన్న సమాసంలో కుండలం కదలుచున్నవేళ సూర్యరశ్మిపడి తళుక్కుమన్న లక్షణాన్ని ధ్వనిస్తున్నది. కనక దాన్ని పోగొట్టుకోవడం ఎలాగా? వీలైనంత వరకు మూలసౌందర్యం అనువాదంలోకి తేవడంలోనే అనువాద సార్థకత.

ఇంత మాత్రాన తెలుగు నిరాదృతం కాదు. దానంటది చాల అందంగా వుదిది. శ్రీ నారాయణగారు బహుసుకుమార రచనాలంకృత చిత్తసద్మలు. అయన ఈ మనోగుణమే పద్యంగా అవతరించింది. కొన్నిచోట్ల మూలశబ్దావి కాయన అనువాదం తెలుగు కావ్య సరస్వతికొక జిగి.

"'శ్రితకమలాకుచ మండల....జయజయదేవహరే (పుట10) 'మంగళము శ్రీనారాయణా'— అన్న అనువాదం చాల గడుసుగా వుంది. కవి నారాయణుడు గనుక, కవి వాక్కు శాశ్వతమన్న ఆశంస ధ్వనిస్తుండటంచేత గడుసు అనువాదమనాలి.

'పతతిపతత్రే—విచలతిపత్రే' (పుట 60)

'ఆకురాలిన సవ్వడియైన — జెక్కుబడిన శబ్దమని అనువదించటం ఎంత సొగసుగా వుందో తెలుగు పదాల సౌకుమార్యం తెలిస్తే తప్ప తెలియదు. అదే పుటలో 'విగళితవసనం - పరిహృతరసనం'— అన్నదానికి త్యక్తవసనమనటం సమంజసంగా తోచదు, అందంగా లేదు. అపహరించిన వసనం - తప్ప త్యజించబడ్డదికాదు.

'ఆవాసో విపినాయతేశా....ర్దూల విక్రీడితం'— (పుట 48) అన్న ముద్రాలంకారం తెలుగు పోయిన మాట వాస్తవమే అయినా అనువాదం నిర్మలంగా వుంది.

'ప్రాతర్నీలనిచోల'— (పుట 30) పద్యానువాదంలో చెలులీ మార్పును చూచి నవ్వగ' అన్నమాట మూలాతిరిక్తమై మూలసౌందర్య సూచకం కావటం హర్షదాయకమైన అనువాదం.

అనువాదాన్ని స్వతంత్ర కావ్యంగా చూస్తే ఈ పద్యరచన చాల సుందరంగా వుంద. 'దరమీలన్నయనంబు (పుట 137) తిమ్మన్న గారి ఎత్తుగడతో పద్యం రచనా స్నిగ్ధంగా వుంది.

'వనిత! సంజవేళల నెలవంక బోలు' (పుట 519

'తమ్మలతూడు దండయిది దర్పక! సర్పము కాదు' (పుట 41)

కొన్ని వుదాహరణాలు మాత్రమే. ఎక్కడ చూచినా ఇంతే. సుకుమారశ్రీ కావ్యాలైన పారిజాతామల్లాగా అందమైన రచనలో కావ్యం నిర్భరంగా వుంది.

అష్టపదుల్ని కొన్నిచోట్ల గీతాలుగా - కొన్నిచోట్ల ముత్యాల సరాల్లాగా - కొన్ని చోట్ల ద్విపదలుగా - అనువదించటం బాగుంది. అంతే కాక ఆ రచన పట్టి చూడదగింది. ఉదా॥ 79 పుట అంతా, 70 పుట. ద్విపదరచనమే. 81లో చివరి పద్యం మాత్రం తేట గీతి. శ్లోకాలు వృత్తాలుగా అనూదితాలైనాయి.

దృశౌతవ మదాలసే'— (110 పుట) అన్న శ్లోకానువాదం 'కనులు మదాల సంబులు'— అన్న దానిలో సురలతాంగులను రాధ ధరించచిట్లు చెప్పిన మాటలు మూలాన్ని తెలుగు చక్కగా ధరించిందనటం సహృదయ సంవాదం తప్ప అన్యంలేదు.

10-1-82 డా॥ తుమ్మపూడి కోటీశ్వరరావు,

అనంతపురం. ఎమ్. ఏ., పిహెచ్. డి,

రీడర్: తెలుగు శాఖ

శ్రీకృష్ణదేవరాయ విశ్వవిద్యాలయం.



# పరిచయము

'గీతగోవిందము'—సంస్కృత వాఙ్మయమున అత్యంత మనోజ్ఞమైన సంగీతాత్మక కావ్యము; (Lyric) ప్రప్రథమ సంగీత నృత్యరూపకము. ఇందలి పాత్రలు ముప్పురు, రాధ, కృష్ణుడు, రాధసఖి. బృందావనమున రాధికతో క్రీడాలోలుడై శ్రీకృష్ణుడుండగా ఏదోఒక అసమ్మతి కారణమున వారికెడబాటు గల్గినది. రాధాకృష్ణుల పునస్సంయోగమునకు రాధసఖి యొనరించిన ప్రయత్నము అందు వర్ణితములు. ఇందలి గీతము లన్నియు చాలవరకు విరహావస్థ యందలి తీవ్రవేదన కుపలక్షకములు. ఇది ద్వాదశసర్గాత్మకము. ప్రతిగీతము అష్టపదాత్మకము. కాన ఈగీతములన్నియు అష్టపదులని ప్రసిద్ధిని గాంచినవి. కథాకథనము. పాత్రల పరిచయము, శ్లోకరూపమునను, నృత్యగానాత్మక సంవాదము అష్టపదిరూపమునను,ఉండి రసికభావవిదులకు అమందానందమును గూర్చుచున్నదీ మహాకావ్యము.

గీతగోవింద కావ్యమునందలి శృంగారము భగవద్రతి గర్భితము. స్త్రీ పురుష సంబంధమగు కామాత్మక లౌకికరతికిని, ఆత్మయొక్క అలౌకికభగవద్రతికిని, తేజస్తిమిరసామ్యమైనను. అద్భుతావహముగా నిందవి పరమసుందరముగా సమన్వయ మందినవి. శమాత్మకమగు రతి భగవద్విషయకమై భక్తిరసమనబడుచున్నది. సామాన్యముగా కామాత్మకరతి పరమపురుషార్థ (మోక్ష) పథమునకు ప్రబల ప్రతిబంధకముగ భావింపబడుచున్నది. ఈ కృతియందు కామము గోవిందపరమై అలౌకిక దివ్యప్రేమగా. పరమ పురుషార్థహేతువుగా నిరూపింపబడినది.

అద్వితీయుడును, ఏకస్వరూపుడును, అగు భగవంతుడు స్వీయమయిన పరమ రసానుభూతికై రాధకృష్ణాత్మక ద్వంద్వరూపము వహించెనని శ్రీకృష్ణపరమహంస బోధించెను. ఆత్మ పరమత్మలే రాధాకృష్ణులు, శ్రీకృష్ణుడు. రాధ, రాధసఖి (క్రమముగ) భగవంతునకు, జీవునకు, భగవతత్త్వవేత్తయగు ఆచార్యునకు. సంకేతరూపులని పరమభాగవతుడగు జయదేవుని జగన్మంగళ నిర్దేశము. ఈతత్త్వమును భూమికయందు శ్రీ నారాయణగారు విపులముగా సిద్ధాంతరూపమున స్థాపించి యున్నారు.

కోమల కాంతపదావళితోడి ఈకావ్యమందలి నాదసౌభాగ్యము అనుపమానము; భావుక హృదయైక సంవేద్యము; రసవాహినియైనశైలి విశద మనోజ్ఞము - శ్లోకములు. అష్టపదులు శ్రోతలకర్థముగాకున్నను వారిహృదయములందు పరమభక్తిభావోత్పాదకములుగా

వివి భాసించుచున్నవి ఇందు సంగీతము, సాహిత్యము, ఒకదానిని మఱొకటి 'పోటీ' పడుచున్నట్లు భావుకులకు తోపకమానదు.

ఈ మహాకావ్యమును శ్రీ యల్. నారాయణగారు ఒక్క మాటలో చెప్పవలెనన్న పరమసుందరముగా అనువదించినారు. ముఖ్యముగా వృత్తరచన, సహజధారాత్మకమై ప్రవాహశైలితో వైదీర్భరీతి ననుసరించి యున్నది. ఈ క్రింది పద్యమును గమనింపుడు.

"వేదానుద్ధరతే జగన్నివహతే ...." [పుట 8. శ్లో. 15]

ఘనతం గాచి శ్రుతుల్-ధరించి జగతిన్-క్ష్మాగోళమున్ మోసి-దై
త్యుని క్రమందించి - బలిం గుదించి - రిపులం దున్మాడి - నిర్జించి రా
వణుఁ . జేఁబూని హలంబు - పాణికరుణా పాత్రిధాన్యముంజూపి-దు
ర్జనులం ద్రుంచు దశావతారుఁడగు కృష్ణా! నిన్ను గీర్తించెదన్, [పుట. ! శ్లో.15]

భగవంతుని దశావతారములను శ్లోకమున నున్నట్లు నాల్గుపాదములలో మత్తేభ వృత్తమున సరసముగా, సమగ్రముగా రచించుట శ్రీ నారాయణగారి పద్యరచనా పాటవమును నిరూపించుచున్నది. 'మ్లేచ్ఛ' శబ్దమునకు బదులు 'దుర్జన' శబ్దము ప్రయోగించుట ఔచిత్య శోభితము

'ఉన్మీలన్మధుగంధ ..... '— [పుట. 18. శ్లో. 34]

"లలనా! తేఁటులు మూగఁ బుష్పరసలోల స్వాంతమై మావిమొ
గ్గలఁ గ్రీడించెడి కోయిలల్ గళరుతుల్ గావింప నెంతేని, వీ
నుల దిమ్మెక్కఁగ నీ వసంతమునఁ బాంథుల్ బాధతో మానసం
బలయన్ ద్రోయుదురీదినంబులఁ బ్రియాధ్యానాతి హర్షంబునన్.

[పుట. 19. ప. 34]

ఈ పద్యము కవికోకిల శ్రీ దువ్వూరి రామిరెడ్డిగారి పద్యసరణిని తలపింప జేయుచున్నది. ఇట్లెన్నేనియు నుదాహరింపవచ్చును. పద్యములన్నియు సరససుందరములై సహృదయహృదయాహ్లాదకరముగా నున్నవి.

అష్టపదులు మాత్రము పద్యములవలె అనువాదమునకు లొంగునవి కావు. ఏలయన ఇవికేవలము సంగీత ప్రధానములు. కాన యివి చాలవరకు తేటగీతము - ఆటవెలది - మాత్రాఛందస్సులలో అనూదితములైనవి మొత్తముమీద అనువాదము మూలానురూపమై

విశదమనోజ్ఞ ఫణితి నలరారుచున్నది. భూమిక కావ్యవిషయిక సమగ్ర వివేచనాత్మకమై, భక్తిరసైకనిర్దేశకమై, శ్రీ నారాయణగారి పరిశోధనశక్తిని, బహుగ్రంధపరిచయమును, నిరూపించుచున్నది. ఇతోధికముగా శ్రీ నారాయణగారు రమణీయకావ్యసుమనస్సులచే ఆంధ్రభారతిని ఆరాధింపగలరని ఆశించుచు ఆశీర్వదించుచున్నాను.

"జయదేవు సుకవితాసార గీతానంద

తరళభావములలో తాండవించు"— భగవంతుని నిరూపమాన రసస్వరూపమును ఆంధ్రగీతగోవిందము ద్వారా రసికభావవిదులు అనుభవించి ఆనందింతురు గాక।

ఇతిశమ్.

వైశాఖ (బుద్ధ) పూర్ణిమ

అనంతపురం

7-5-1982

డా॥ రత్నాకర బాలరాజు M. A., Ph. D.,

ఆంధ్రశాఖాధిపతి

విశ్వవిద్యాలయము.



# భూమిక

"సంసార సార సర్వస్వం, శ్యామలం మహదుజ్జ్వలం
ఏతజ్జ్యోతి రహం వంద్యం, చింతయామి సనాతనమ్."

సంస్కృత సాహిత్య ప్రపంచమున గీతాగోవింద కావ్యమున కొక విశిష్టస్థానము గలదు. లలిత కోమల కాంత పదావళీ కలితములై నాదరమ్యములైన అష్టపదులతో, వృత్తములతో నిటు సంగీత రసజ్ఞులను, సరస విలాస కళా సముపేతమైన కథా సంవిధానముతో నటు రసికభావ విదులగు సాహితీప్రియులను, ఏక కాలమున నలరింప జేయగల్గిన మహాకావ్యమీ గీతగోవిందము. హరిస్మరణ కథాత్మకము నగుటచే హరి భక్తులకిది అత్యంత ముపాస్యము. ఇట్టి సరస ప్రబంధమునకు కర్త శ్రీ జయదేవ మహాకవి.

## దేశకాలములు

జయదేవుడు పరమభక్త శిరోమణి. ఈ మహాత్ముడు వంగ, ఓఢ్ర, మిథిలా ప్రాంతములకు జెందినవాడని జన్మ దేశమును గుఱించి వివాదము లున్నవి. పశ్చిమ బెంగాలున బీర్బం జిల్లాలోని అజయ నదీ తీరమునగల కెందూళి అను గ్రామమునకు జెందినవాడని ఆధునిక విమర్శకుల నిర్ణయము. ఈ గ్రామమున జయదేవ నామమునకు సంబంధించిన ఉత్సవము [జయదేవ తాకూరు మేళా] ప్రతి సంవత్సరమును 800 సంవత్సరముల నుండి ప్రజలు జరుపుకొను చున్నారు. ఈ కెందూళి గ్రామమే కెందు బిల్వము. తన జన్మ దేశమును గుఱించి జయదేవుడు :-

'కిందుబిల్వ సముద్ర సంభవ రోహిణీ రమణేన' — (పుట 40 శ్లో. 9) అని పేర్కొని యున్నాడు. కెందు బిల్వము, కిందు బిల్వము, తిందు బిల్వము, అనియు నామములు గలవు

కెందూళి – అను పేరుగల గ్రామమొకటి ఒరిస్సా రాష్ట్రమున పూరీ జిల్లాలో బలి పట్టణము పోలీసు స్టేషను సమీపము నందున్నది. మిథిలా ప్రాంతము నందును

గలదు. ఒరియా సాహిత్యముపై జయదేవుని గీతగోవింద ప్రభావ మధికముగ నుండు టచే నీ మహాకవి ఆ రాష్ట్రమునకు జెందినవాడను ప్రవాదమును గలదు.

పశ్చిమ బెంగాలులోని 'కెందూళి' గ్రామ సమీపమున ఒక చెరువు ప్రక్కనగల శిథిల గృహమును జయదేవుని నివాస గృహముగ నా ప్రాంతపు ప్రజలు భావింతురు. 18వ శతాబ్దమునకు (1746 A D) జెందిన బెంగాలీ వ్రాత ప్రతి [హరి నామామృత వ్యాకరణమను గ్రంథమునకు సంస్కృత వ్యాఖ్యానము] యందు 'గోపీ చరణదాసు' అను తత్కర్తతాను 'కెందుబల్వ' గ్రాను నివాసినని పేర్కొనియుండెను. ఈ బెంగాలీ వ్రాత ప్రతిని, కెందుబిల్వ గ్రామ మందు జరుగుచున్న 'జయదేవ ఠాకూరు మేళా'- మొదలగు వానిని పురస్కరించుకొని జయదేవ కవి బెంగాలు దేశమునకు చెందిన వాడని డా॥ హరేకృష్ణ ముఖర్జీనారు స్థాపించియున్నారు.

ఈ కెందూళి గ్రామ మిప్పటికిని పశ్చిమ బెంగాల్ రాష్ట్రమున ప్రముఖ వైష్ణవ యాత్రా స్థలముగ నున్నది. జయదేవ కవి గౌరవార్థమై జరిగెడి వార్షిక 'మేళా' సందర్భమున వైష్ణవ సన్యాసు లనేకులు పలు ప్రాంతముల నుండి వచ్చి పాల్గొను చున్నారు. కాన ఒరిస్సా, మిథిల ప్రాంతము లందు కెందూళి నామము గల గ్రామము లున్నను పశ్చిమ బెంగాల్ రాష్ట్రము నందలి కెందూళి గ్రామమే జయదేవ కవి నివాస గ్రామమను వాదము బలీయమై స్థాపింప బడినది.

క్రీ. శ. 12వ శతాబ్దమున పశ్చిమ బెంగాల్ రాష్టమున భాగీరథీ తీరమందలి నవ ద్వీపమును పరిపాలించిన లక్ష్మణసేన మహారాజు నాస్థానమున నీ కవి యుండెను. ఈ మహారాజు సంస్కృత విద్యాప్రియుడు. లక్ష్మణసేనుని సభా ద్వారమునగల శిలా శాసనము నందలి క్రింది శ్లోకము గూడా యీ విషయమును దెలుపుచున్నది.

"గోవర్ధన శ్చ శరణో జయదేవ ఉమాపతిః
కవిరాజ శ్చ రత్నాని సమితౌ లక్ష్మణస్య చః

ఆధునిక పరిశోధన ననుసరించి లక్ష్మణసేన మహారాజు క్రీ. శ. 1116 నుండి 1160 వఱకు పాలించినట్లు తెలియుచున్నది. కాన జయదేవ కవియు 12వ శతాబ్దపు పూర్వార్థమున నున్నట్లు నిశ్చయింప వచ్చును. మఱి కొందఱు పండితులు జయదేవుడు జన్మతః ఒరిస్సా దేశమునకు చెందిన వాడనియు, బెంగాల్ దేశమునకు వెళ్లి అచటనే రాజాస్థానమున బ్రసిద్ధుడై సంగీత సాహిత్యాత్మకమైన ప్రప్రథమ నృత్య నాటికయగు

గీతాగోవింద కావ్యమునకు కర్తగా భారత దేశమున నారాధ్యుడయ్యెననియు జెప్పుదురు. ఈ వివాదములకంటె పూర్వోక్తమైన బెంగాల్ దేశము నందలి కెందూళి గ్రామమే ఈ కవి నివాసస్థలమను వాదము సహేతుకమై నిర్ణయింప దగియున్నవి

## జయదేవ కవిని గూర్చిన ఆఖ్యాయికలు

ఈ మహాకవిని గూర్చిన కొన్ని వివరములు గీతగోవింద కావ్యము నుండి తెలియుచున్నవి. నివాస స్థలము కిందు బిల్వము తల్లి రమాదేవి. వామాదేవి, రాధాదేవి యనియు కలదు. తండ్రి భోజదేవుడు. భార్య పద్మావతీదేవి రోహిణియనియు మరొక పేరు. మిత్రులు పరాశరాదులు. వీరు గీతగోవింద కావ్యము నందలి అష్టపదులను గానము చేయుచుండెడి వారట తన తల్లి దండ్రులను. సమకాలిక కవులను గూర్చి యిట్లు పేర్కొనెను.

'శ్రీ భోజదేవ ప్రభవస్య రామాదేవి సుతశ్రీ జయదేవ కస్య
పరాశరాది ప్రియవర్గకండే శ్రీ గీతగోవింద కవిత్వ మస్తు' [పుట 142]
'వాచః పల్లవయ త్యుమాపతి ధరః ........'— [పుట 2]

ఈ కవి పద్మావతీదేవిచే శ్రీకృష్ణ పరమాత్ముని సన్నిధి అభినయాత్మక నృత్యము చేయించెడి వాడని _

'వాగ్దేవతా చరిత చిత్రిత చిత్తసద్మా
పద్మావతీ చరణ చారణ చక్రవర్తి ....'— పుట 2 శ్లో 2

అను దానిచే తెలియుచున్నది. నాట్యాద్యుప చారములచే భగవంతుని సంసేవించుట భాగవత లక్షణము. జయదేవుడు భాగవతాగ్రేసరుడు.

15వ శతాబ్దమునకు చెందిన 'సేక శుభోదయము'- అను గ్రంథమున జయదేవ కవికి సంబంధించిన కొన్ని కథలు గలవు, సిఖులు జయదేవుని మహాభక్తునిగా, గురు నానక్ మహాత్మునకు పూర్వగామియగు భగవద్భక్తి ప్రవర్తకునిగా భావింతురు. వారి 'గురు గ్రంథమునందు' జయదేవ కవివని చెప్పబడు కొన్ని గీతములు కలవు. బెంగాలీ భాషయందు వనమాల దాసు రచించిన జయదేవ చరితము ప్రసిద్ధము. ఇది 17వ శతాబ్ది పూర్వార్ధమున రచింపబడినవి. ఇందు పద్మావతీ జయదేవుల పవిత్ర జీవనము, వారి శ్రీ కృష్ణభక్తి. సంపూర్ణముగా నుల్లేఖింపబడినది

## జయదేవ నామక కవులు

సంస్కృత సాహిత్యమున జయదేవ నామక కవులు పలువురు కలరు. ఒక జయదేవుడు ఛందస్సూత్రమును రచించినట్లు ఆలంకారిక మూర్ధన్యుడగు అభినవ గుప్తుడు పేర్కొనెను. ఈ జయదేవుడు గీతగోవింద కావ్యకర్తయైన జయదేవునకు సుమారు 300 సంవత్సరములు పూర్వుడు. ప్రసన్నరాఘవ నాటక కర్తయైన జయదేవుడు కౌండిన్య గోత్రుడు. తల్లి దండ్రులు సుమిత్రా మహాదేవులు. గురువు హరిమిశ్రుడు. ఈ మహాకవి యించుమించు జయదేవునకు సమీపకాలము నందుండును. క్రీ శ. 1257 సంవత్సరమున కాశ్మీరకవి కల్హణునిచే సంకలితమైన సూక్తిముక్తావళి యందు ప్రసన్న రాఘవ నాటక శ్లోక మొకటి పేర్కొనబడినది. ఈ కవి విదర్భ దేశమునకు జెందినవాడని కొందఱందురు. చంద్రాలోకమను అలంకార గ్రంథమును రచించిన దీ జయదేవుడే కావచ్చునని కొందఱ అభిప్రాయము. ఈ కృతికి బెంగాల్ దేశమున ప్రసిద్ధి లేకుండుటయు పై విషయమున నాధార మగుచున్నది.

## జయదేవుని జీవిత విశేషములు

రామాదేవీ భోజదేవులు శ్రీకృష్ణ భక్తులు. ఆ పరంధాముని కృపా విశేషముచే చిరకాలమునకు వారికొక పుత్రరత్న ముదయించెను. అతడే జయదేవ కవి. వైష్ణవ సంప్రదాయము ననుసరించి వ్యాస భగవానుడు భాగవత రచనచే సంతృప్తి జెందక భగవద్భక్తిని మఱింత అధికముగ లోకమున వ్యాపింప జేయుటకై జయదేవుడుగా నవతరించెనను ఇతిహ్య మొకటి గలదు.

## వివాహ వృత్తాంతము

ఈ కవి వివాహముం గూర్చి యిట్లు చెప్పబడియున్నది. దేవశర్మ యను బ్రాహ్మణుడొక డనపత్యుడై జగన్నాథముజేరి తదధిష్ఠాన దైవమగు జగన్నాధునితో "దేవా! నాకు సంతానము గల్గినచో. మొదటి సంతానమును నీకు సమర్పించు కొందును"- అని ప్రార్థించి గృహమున కేగెను. కొంత కాలమున కా బ్రాహ్మణునకు పుత్రికాప్రాప్తి కల్గినది తదుపరి కుమారులు గూడ కల్గినారు. అతడు జగన్నాధుని సందర్శించి "స్వామీ నీ కృపా విశేషముచే తొలుత నాకు పుత్రిక కల్గినది; కుమారులును గల్గినారు. ఇదిగో! ఈమెను స్వీకరించి నన్ను ధన్యుని జేయు" మని ప్రార్థించి అర్చకునకు విషయము నంతయును దెలిపి గృహమున కరిగెను.

నాటి రాత్రి దేవశర్మకు స్వప్నమున జగన్నాధుడు సాక్షాత్కరించి "నీ యెడల నేను ప్రసన్నుడనైతిని. నీ పుత్రికను స్వీకరింతును. నా భక్తుడైన జయదేవున కామెను సమర్పింపుము. నేనే జయదేవుడనని తెలిసికొమ్ము"- అని పలికెను. దేవశర్మ తనయను వెంట నిడుకొని జయదేవుని చెంతకేగెను.

గ్రామము వెలుపల నున్న తన కుటీరమున జయదేవుడు శాస్త్రాధ్యయనములో నిమగ్నుడై యుండెను. దేవశర్మ జయదేవునకు నమస్కరించి యిట్లు పలికెను. "ఓ మహానుభావా! ఈమె నా పుత్రిక: పద్మావతి జగన్నాధుని ఆదేశమున నీ కన్యను మీకు సమర్పించు చుంటిని. స్వీకరింపుడు".- ఆ మాటలు విని జయదేవుడు "నేను దరిద్రుడను. కన్యాదాన స్వీకరణమున కనర్హుడను. నాకు వివాహము నందిష్టము లేదు. జగన్నాధుని యాదేశమని నన్ను వంచించుచుంటివేల?— అనగా దేవశర్మ అర్చకునిచో నైతము చెప్పించెను: ప్రతిమాలెను. కాని జయదేవుడు సమ్మతింప డయ్యెను. అపుడాతడు కుమార్తెతో "ఇతడు నీ భర్త. నీకు సదా పూజనీయుడు. పతి సేవా పరయైన సతి సర్వాభ్యుదయముల నందును". అని పద్మావతి నట వదలి వెళ్లెను. తన యెదుట నిలబడియున్న పద్మావతితో జయదేవుడు "నిన్ను వీడి నీ తండ్రి వెడలి పోయెను. అరణ్యములో నొంటరిగా నీ వెట్లుంటువు"?— అనగా నామె "మహాత్మా! నన్ను నా తల్లిదండ్రులు మీకర్పించిరి. నేను మీ దానను. నిర్దోషురాలనైన నన్ను మీరును త్యజించిన నేనేమి చేయగలను? అదియుగాక మీరుండగా నేనేకాకి నెట్లగుదును? అని పల్కెను. జయదేవు డిట్లు తలంచెను. "ఈమె పల్కినది సత్యము. త్యజించిన దోషము వాటిల్లును. ఈమే తల్లిదండ్రులకు దెలిపి విధిపూర్వకముగ వివాహ మాడుటయే లెస్స."— అని నిశ్చయించి ఆమె నింటికి దీసికొనిపోయి తల్లి దండ్రుల అనుమతితో శాస్త్రోక్త ప్రకారమున పరిణయ మాడెను. పద్మావతి జయదేవుల వివిక్తాత్ములై మెలగుచుండిరి. జయదేవుడు భగవచ్చరితము గాన మొనరింప పద్మావతి నాట్య మొనర్చుచుండెడిది.

## కావ్యనిర్మితి

జయదేవుడు స్వయముగ శ్రీకృష్ణచరిత్రమును రచించి తద్గానమున పురుషోత్తము నారాధింప నెంచెను. శ్రీకృష్ణ భగవానుడు రాధను అనునయించెడి సందర్భమున "శిరస్యాధేహి మే పాదం"— అను వాక్యార్థమును భగవదపచారముగ భావించి

మార్పు చేయుటకు వేఱొక పదము స్ఫురింపనందున పుస్తకము నటనుంచి స్నానార్థ మరిగెను. అంత భగవంతుడే జయదేవుని రూపమునవచ్చి పద్మావతిని గ్రంథము నడిగి తీసికొని జయదేవుడు భావించిన పద్యమునే వ్రాసి తిరోహితు డయ్యెను. గంగ నుండి జయదేవు డేతెంచి పూజాదికము నిర్వర్తించి పుస్తకము గైకొని మనసున సంకల్పించిన పద్యము వ్రాయ నుపక్రమించెను. అంతు తాను వ్రాయని ఆ పద్యమునుగాంచి ఆశ్చ ర్యమున నర్ధాంగితో "ఇది వ్రాసిన దెవరు? నేను వ్రాసినది కాదే! — అనగా "మీరు పరిహసించుచుంటిరా! నది నుండి యేతెంచి మీరే కదా వ్రాసి మరల నేగితిరి. మీరు తప్ప యెవరిట్లు వ్రాయగలరు" — అన్న పద్మావతి మాటలకు జయదేవుడు విస్మితుడై తదేక చింతనా నిమగ్నుడై యుండెను. నాటి రాత్రి భగవంతుడు స్వప్నమున సాక్షాత్క రించి ఆ పద్యము తాను వ్రాసినదే యని. తద్భావము తనకు సమ్మతమైనదని, పలికెను. జయదేవుడు "భగవంతుని దర్శనముచే తన భార్య ధన్యురాలైన" దని తలంచి మిక్కిలి యానందించెను. కావ్య రచన సమాప్త మొనరించి మహాకవి భగవం తునకు సమర్పించెను.

గీతగోవింద కావ్య గాన లాస్యములచే పద్మావతీ జయదేవులు భగవంతు నారా ధించుచుండిరి. జగన్నాథ పురవాసియగు సాత్విక రాజను ప్రభువు ఆ అష్టపదులను విని వాని ననుకరించుచు తాను మఱియొక "గీతగోవిందము" — రచించి దానినే అందఱు గాన మొనరింప వలెననియు లేనిచో దండింప బడుదురనియు ప్రజలను శాసించెను. రాజ శాసనమునకు భయపడి యెవరును జయదేవుని గీతగోవిందము గానము చేయ కుండిరి. ఒకనాడు జగన్నాధుని సన్నిధిని స్వకృత కావ్యమును గాన మొనర్చుచున్న జయదేవుని గాంచి రాజు 'నా కావ్యము నీ కెందుకు స్వీకరింపనైతి' వని యడిగెను. "రాజా! మీ కావ్యము నే నాదరించితిని, కాని జగన్నాధుడు నా కావ్య గానమున నానం దించునట్లు మీ కావ్య గానమున నానందించుటలేదు. కావలసిన మీరే పరీక్షింపు" డని మహాకవి పలికెను. రాజు రెండు గ్రంథములను భగవత్సన్నిధి నుంచి, "దేవా! నీకేది యిష్టమో దానినే స్వీకరించి మమ్ముల ధన్యులగావింపు" మని ప్రార్థించి ఆలయ ద్వారములు మూసి. ముద్రవేసి భక్తులందఱతో పాటు నిజ గృహమున కేగెను.

ప్రాతఃకాలమున అందఱును వెళ్లి తలుపులుతెఱచి చూడగా. జయదేవుని కావ్యము భగవత్పాదములపై నుండెను. భూపతి కావ్యము దూరమున విసర్జితమై యుండెను. ఆశ్చర్యపరవశులై భక్తులెల్లరును జయదేవుని కొనియాడిరి. అవమాన

దుఃఖితుడైన జనపాలుని ప్రార్థనను మన్నించి కరుణా సింధువగు జగన్నాథుడు రాజ కృత గ్రంథమందలి యిరువదినాలుగు శ్లోకములను జయదేవుని గ్రంథమునజేర్చి అను గ్రహించెను.

## గీతగోవింద కావ్య ప్రశస్తి

జగన్నాధ క్షేత్ర సమీపమందలి యొక గ్రామమున నివసించు శాక విక్రయిణి [కాయగూరలమ్ముకొను స్త్రీ] యొకనాటి వెన్నెల రాత్రియందు గీతగోవింద కావ్యమందున్న అష్టపదులను గాన మొనర్చుచు వృంతాకవన మధ్యమున నటు నిటు దిరుగుచు వృంతాక ములు [వంకాయలు] గోయుచుండెను. గానమునకు ముగ్ధుడైన శ్రీకృష్ణ భగవానుడా యష్టపదులను వినుచు నామె యెటు పోయిన నటు తానును దిరుగుచుండెను. అటునిటు తిరుగునపుడు వృంతాక కంటకములు తగులుకొని ఆ భగవానుని వస్త్రములు చినిగిపోయి నవి. ఆమె వృంతాకములను సేకరించి నిజగృహమున కేగినది. జగన్నాథు డాలయము జేరెను.

ప్రాతఃకాలమున నాలయ కవాటములు దెరచి లోన బ్రవేశించిన అర్చకుడు దేవదేవుని వస్త్రములు పేలికలై యుండుట గాంచి భయాందోళిత స్వాంతుడై రాజున కా వృత్తాంతము దెలిపెను. రాజా సంఘటన కాశ్చర్యమంది డోలాయమాన మనస్కుడై యుండెను. నాటి రాత్రి చింతానిమగ్నులై యున్న అర్చకునకు, రాజునకు పురుషోత్తము డదే రూపమున కలలో గనపడి జరిగిన విషయముదెలిపి వారి కానందము గల్గించెను. మరునాడు రాజు, నర్చకుడు తమతమ స్వప్నవృత్తాంతములు దెలుపుకొని గీతగోవింద కావ్య ప్రభావమును, శాక విక్రయిణి అదృష్టమును కొనియాడిరి. రాజా ధన్యాత్మురాలిని పిలిపించి, భూవసతి యేర్పఱచి, అచటనేయుండి గీతగోవింద కావ్యగానముచే జగన్నాథుని సేవించునట్లు ఆజ్ఞాపించెను.

## జయదేవుడు - చోరులు

జయదేవుని ప్రభావమును విని ఒకానొక సంపన్న వైశ్యుడు తన గ్రామమునకా మహాత్ముని నాహ్వానించెను. జయదేవు డచ్చటికేగి ధనకనక వస్త్రాలంకరణాదులచే సన్మానితుడై అటవీమార్గమున నొంటరిగా భగవన్నామస్మరణ మొనరించుచు వచ్చు చుండెను. అంతక సదృశులైన నల్వురు దొంగలు ఖడ్గధరులై ఆ కవిని సమీపించిరి.

వారినిగాంచి జయదేవుడు ప్రాణ రక్షణమున కుపాయ మూహించి 'నాయనలాలా : మీరెచ్చటకు బోవుచున్నా''రని ప్రశ్నించెను. 'పురుషోత్తను పురమునకు బోవుచున్నా' మని వారుపలుక. 'అచటికే నేనును బోవుచున్నాను. వార్ధక్యవశమున ధనభారమును వహించి నడువలేకున్నాను. మీరిది తీసికొనుడు'- అని వారికాధనము నొసగి ప్రాణ రక్షణమునకు మదాన్వితుడై ముందునకు సాగుచుండెను. చోరు లిట్లుతలంచిరి. ''ఇతడు మనచే ముల్లె మోయించికొనిపోయి స్వగ్రామమున మనల దండించుటకై చూచుచున్నట్లున్నది. కాన మన మితనిని చంపిపోవుటయే మంచిది''. వారిలో నొకడిట్ల నెను. 'చంపుటచే మనకుకల్గు ప్రయోజనమేమి? చెట్టునకు బంధించి పోదము'. — నల్వురును కలిసి కవిరాజు నొక వృక్షమునకు బంధించిరి. కాని వారిలో నొక క్రూరాత్ముడు ఖడ్గముతో జయదేవుని కరచరణములను ఖండించెను. తరువాత యథేచ్ఛగా వారేగిరి.

జయదేవుడది తన ప్రారబ్ధకర్మమని భావించి క్షుత్పిపాసాపీడితుడై జగన్నాథుని స్మరించుచు నుండెను. వేటకై వచ్చిన వింధ్య దేశాధిపతి జయదేవునిగాంచి మిక్కిలి కటకటపడి. పల్లకిలో స్వనగరమునుజేర్చి సముచితోపచారముల సంసేవించు చుండెను భాగవతసేవాపరాయణుడైన ఆ రాజును వంచింపనెంచి, చోరులు సాధువేషముల సందర్శించి. అటనున్న జయదేవుని గాంచి భయపడసాగిరి. క్షమాశాలియైన జయదేవుడు వారిని గౌగిలించుకొని రాజుతో ''వీరు మహాత్ములు; సర్వశాస్త్ర పారంగతులు. సన్మార్గులు. కాన వీరిని ధనాదికముచే సత్కరింపు''డని వచించెను రాజు నట్లే ముదమున వారిని సత్కరించెను సంతోషమునవారు పోవ నుద్యుక్తులుకాగా. జయదేవుడు ''అరణ్యప్రాంత మత్యంత భయావహము. మీ భృత్యులను తోడిచ్చి పంపుడు. అరణ్యమును దాటించి వారు తిరిగివత్తురునాక'' — అని పల్కెను. రాజు సేవకుల నైదుగురును వారికి తోడుగా పంపెను. అరణ్యమున వృక్షచ్ఛాయ వారు విశ్రమించి నపుడు రాజసేవకులు కుతూహలమున వారితో 'మీకును కవిరాజునకు నేమి సంబంధము? రాజుచే మిమ్ముల నీరీతి సన్మానింప జేయుటకు కారణమేమి? ... అని యడిగిరి, వారిట్లు వచింపబొడగిరి.

మేము జయదేవునితోపాటు కర్ణాట దేశాధీశుని కొల్వులో నుంటిమి. ఒకపరి ఈ ద్విజాధము డొక ధనికునింట దొంగలింపబోయి సేవకులకు పట్టువడెను. రాజు జయదేవుని వధింప చండాలుర కాజ్ఞాపించెను. మేము జయదేవుని రక్షింపదలచి చండాలురతో ''బ్రాహ్మణుడు వధ్యుడుకాడు. ఇతనిని వదలిపెట్టుడు. రాజునకు ప్రత్య

యము కల్గించుటకై కాలి వ్రేళ్ల మాత్రము ఖండించుకొనిపోయి చూపుడు' — అని వారికి కొంత ధనమిచ్చి ఆశపెట్టితిమి. కాని వారతని కాలుసేతులు ఖండించి రాజునకు చూపిరి. మిత్రుని ఈ దురవస్థకు విరక్తులమై మేమిట్లుయితిమి. అప్పటి మా యుప కారము దలంచి జయదేవుడిట్లు మమ్ము సన్మానింప రాజును ప్రోత్సహించెను.

ఈ అసత్య పాపభారము ధర్మదేవతకు దుస్సహమైనదో అన్నట్లు ఆకాశము నుండి పిడుగొకటి వారి తలలపై బడినది. రాజభటులు ఆ దృశ్యమునకు నిశ్చేష్టులై కొంతవడికి తెప్పరిల్లి, తిరిగివెళ్లి రాజునకు జరిగిన వృత్తాంతము విన్నవించిరి. జయదేవుడది విని అత్యంత దుఃఖితుడై ఛిన్న కరచరణములతో భూమిని మోదగా నాశ్చర్యకరముగ అతనికి యథారీతి కరచరణములు సిద్ధించినవి. రాజు విస్మితుడై ''ఆశ్చర్యము! దయచేసి యథార్థము తెలుపు'' డని జయదేవుని ప్రార్థించెను. జయ దేవుడు చోరుల వృత్తాంత మంతయు జెప్పెను. రాజు జయదేవుని సమదర్శనమునకు మిక్కిలి ఆనందించి ఆ మహాత్ముని కొనియాడెను. జగన్నాథము నందున్న పద్మావతీ దేవిని సగౌరవముగ పిలిపించి భార్యా సమేతముగ నా పుణ్యదంపతులను సేవించు చుండెను.

## పద్మావతీ పాతివ్రత్య మహిమ.

పద్మావతి పతివ్రతా శిరోమణి. వింధ్య దేశాధిపతి పద్మావతీ జయదేవులను భక్తిశ్రద్ధలతో సేవించుచుండెను. ఒక పర్యాయము రాజుగారి బంధువు కాలధర్మమున మృతిజెందెను. అతని భార్య సహగమనము చేయుటకై శవమువెంట శ్మశానస్థలికి బయలుదేరినది. ఆ సమయమున రాణి కడనున్న పద్మావతి వీధిలో జరుగు సంరంభ మును తెలిసికొని 'భర్త మరణవార్త విన్నవెంటనే శోక భారముతో ప్రాణములు వీడునది పతివ్రతకా యింతవరకు ప్రాణములు నిల్పునది పతివ్రత యెట్లగును'? — అని యడిగిన యామె పలుకులకు రాణి వెఱగుపడినది.

ఒకనాడు రాజు జయదేవ పురస్కృతుడై అరణ్యమునకు వేటకై వెళ్లి కడు నాలస్యముచేసెను. ఇంతలో నొక రాజభటుడేతెంచి. 'మహాకవి జయదేవు' లొక పులివాతబడిరి. ప్రభువు దుఃఖసంతప్తులై నగరమునకు రానాలస్యము చేయుచుండిరి?''- అని కన్నీటితో రాణికి విన్నపించెను. అచ్చటనేయున్న పద్మావతి ఆ మాటలు విన్న వెంటనే ''అయ్యో! ఎంత దారుణము జరిగిన'' దనుచు క్షణకాల మట్లే యుండి నేల

వ్రాలినది. రాణి సంభ్రమాశ్చర్యముల నామెను పరీక్షించి నిర్గతప్రాణయని తెలిసి కొని గుండెలు బాదుకొనుచు విలపించసాగెను. కవితో నేతెంచిన రాజు అంతఃపురము జేరి నిశ్చేతనయై పడియున్న పద్మావతిని, రోదించుచున్న భార్యను గాంచి విస్మితుడై యిదేమని భార్యనడిగెను. 'నా దుశ్చేష్టచే కల్గిన ఫలితమిది'— అని పల్కుచు తనకు పద్మావతికి జరిగిన సంవాదము. తా నామెను పరీక్షించుటకై చేసిన ప్రయత్నము తత్పర్యవసానము రాజునకు విన్నవించి రక్షింపుడని ప్రార్థించినది. రాజు తన భార్య చర్యకు మిక్కిలి కటకటబడి పద్మావతి లేక తన మిత్రుడు జయదేవుడు జీవించునా యని తలంచుచు భార్యను దండింప నిశ్చయించుకొనెను.

జయదేవుడు 'రాణి నిరపరాధిని కుతూహల మామె నిట్లు ప్రేరేపించినది. ఇంత కును దైవ సంకల్పమిట్లున్నది. సావధానులరై జగన్నాధుని స్మరింపుడు.'— అని పల్కుచు వీణ జేకొని తాను రచించిన "ప్రియే చారుశీలే... ..." (పుట 104 శ్లో 3) అను గీతమును భక్తియుక్తముగ గాన మొనర్పసాగెను. అపుడు పద్మావతి కళేబరము కదలినది. అందఱు నాశ్చర్యమున జూచుచుండ నామె లేచి పాట కనుగుణముగ నాట్య మొనర్చసాగినది. రాజు సంతుష్ట మనస్కుడయ్యెను. రాణి తన తప్పిదమును మన్నింపుమని పద్మావతిని వేడుకొన్నది.

## ప్రసన్న గంగ

"జననీ జన్మభూమిశ్చ స్వర్గాదపి గరీయసీ."— అను నార్యోక్తి ననుసరించి జయదేవుడు కొంతకాలము రాజసేవలనంది తిరిగి స్వస్థలము జేరెను. కాలనియతిని అమ్మహాత్ముడు వృద్ధుడయ్యెను. గంగాస్నాన మా కవి నిత్యానుష్ఠానముల నొకటి. జరా పీడితుడైనను మిక్కిలి కష్టముతో గంగను జేరి స్నానమాచరించి గృహమున కేతెంచుచు నొకనాడు మార్గమధ్యమున మూర్ఛితుడయ్యెను. అదేత్రోవ స్నానార్థమై గంగకు జను అదేశము నేలు రాజు జయదేవుని గాంచి అత్యంత దుఃఖితుడై పల్లకిలో మందిరము జేర్చెను. స్నానార్థమై నిత్యము పల్లకిలో పోవలసినదని రాజు ప్రతిమాలినను జయదేవు డంగీకరింపడయ్యెను.

నాటి రాత్రి రాజునకు రాజపురోహితునకు, అపురమందలి మహాత్ములకు కవికిని, ఏక కాలమున స్వప్నమందు శుక్లాంబరధారిణి, మకరవాహన, పద్మహస్త, అరవిందాక్షి యగు నొక దివ్యమూర్తి కాన్పించి, "నేను భాగీరథీదేవిని. ఇక నుండి నా భక్తుడైన

జయదేవుని ఇంటి బావియందు నివసింతును. నాతో పాటు పద్మ మొకటి అందుద్భ వించును. వృద్ధుడైన జయదేవునకు స్నాన విషయకమై వ్రతభంగము కలుగరాదు'.— అని పల్కెను. ప్రభాతమున నందఱును రాజు కడకేగి తమ తమ స్వప్నవృత్తాంతములు దెలుపుకొని ఆశ్చర్యపడిరి. వారందఱతో పాటు రాజు జయదేవుని సన్నిధికేగి తమ స్వప్నముల దెలిపెను. ఆ మహాత్ముడు వారి భాగధేయమును శ్లాఘించి, "జగన్మాత, జగదుద్ధారిణి" యైన భాగీరథీదేవి తప్పక బావియందు ప్రత్యక్షము కాగలదు. ఇందు సందేహము లేదని పద్మావతీ సహితుడై భక్తితో స్నానమంత్రాత్మక గంగాప్తవ మొనర్చుచు బావిలోదిగెను

గంగానది ప్రాదుర్భావ మందె. దగ్గకుండేంపు నిర్మలమైన జలము తరంగితమై ఉప్పొంగినది. ఆ జలమందు పద్మ మొకటి దోచినది. జనులందఱును ముకుళిత హస్తులై గంగకు మ్రొక్కులిడిరి. జయదేవుడు హర్షాశ్రు పూర్ణనయనుడై భక్తితో భాగీరథిని అర్ఘ్యపాద్యాదుల పూజించి పత్నీయుతుడై స్నానమొనర్చెను. స్నాన ప్రభావంబున నా మహాత్ముడు దివ్యదేహుడై ప్రకాశించెను.

ఈ ఆఖ్యాయికలన్నియు జయదేవుని భగవద్భక్తిని, తత్ప్రభావమును, గీత గోవింద కావ్య ప్రశస్తిని వెల్లడించుచున్నవి.

## గీతగోవిందము కావ్యము కాదను పూర్వపక్ష వాదము

ఆలంకారికులు జయదేవుని గీతగోవిందమునకు మహాకావ్యత్వమును నిషేధించిరి. వారి పూర్వపక్షవాదమును బరిశీలించి తత్ఖండన మొనర్చుట భగవద్భక్తుల కుపాదేయము.

ప్రసిద్ధులగు ఆలంకారికుల మతమున ఈ కావ్యము అతిశయ కామదూషితము: అశ్లీల సంభరితము, కళ నీతిపరము నాదని చెప్పినను, సాధారణ జీవితమున అశ్లీలముగా గన్పించు విషయములను కళ అనుమతింపజాలదు. కవితా కళయందు సంయమము ప్రధానము ధ్వన్యాత్మకముగా నుండవలెను గాని గీతగోవిందమునందువలె వాచ్యము కారాదు. ఈ క్రింది అష్టపదులందలి అత్యంత కామ విషయాసక్తిని జయదేవుని కవిత్వమును అభినందించువారు సైతము సమర్థింపజాలరు.

"విగళిత వసనం, పరిహృత రసనం ......" (పుట 60 గీ 16)

"ఉరసిమురారే రుపహిత హారే ...... " (పుట 60 గీ 15)

'సరసఘనే జఘనే .....' (పుట 140 గీ 22)

'దోర్భ్యాం సంయమితః .......' (పుట 131 శ్లో 10)

'వామాంకే రతికేళి సంకుల సమారంభే' ....... (పుట 134 శ్లో 11)

సంభోగ విప్రలంభముల యందు అతిశయించిన శృంగారము దూష్యమని ఆలంకారికుల మతము. ప్రాచీనులగు మహాకవులట్టి నిరవధికమగు కామ విషయాసక్తి శృంగార రసాంగముగ భావింపలేదు. వాల్మీకి మహర్షి శృంగారమును వాచ్యమొనరింపలేదు. సీతా విషయకమయిన రాముని విరహవేదన కిష్కింధా కాండమున చిత్రింపబడినది. యుద్ధకాండమున విప్రలంభ శృంగారము యొక్క పరమావధి వర్ణింపబడినది. శ్రీరామ విలాపమందెచ్చటను కామవిషయా సక్తిని ధ్వనింపజేయు సందర్భము మనము చూడము.

భవభూతి సైతము సీతారాముల శృంగారమును ఉత్తర రామ చరిత్రమున మిక్కిలి మనోజ్ఞముగ సంయమముతో వర్ణించెను. వాల్మీకి తరువాత అంతటివాడు కాళిదాస మహాకవి. అతడు శృంగారమును తన కావ్యములందు సత్త్వసుందరముగా పోషించెను. కుమారసంభవ మందలి ఉమాసురత వర్ణనము మాత్రము ఆలంకారికుల చేత నిరసింపబడినది. కొందఱది కాళిదాస రచన కాదందురు. శాకుంతలమున మృదువుగా కళాత్మకముగా శృంగారము నిరూపింపబడినది. దుష్యంతుని యెడల శకుంతలకు గల విజృంభమాణమగు ప్రేమ హ్రీగుణముచే నాచ్ఛాదితమై రమ్యమైయున్నది. అతనిలో నామె ఏకాంతముగ నున్నపుడు "పౌరవః రక్షవినయం, మదన హస్తగతాపి ఆత్మనో నప్రభవామి"— అని పల్కును. ఆ మాట ప్రియుని యెడల ఒక సిన్యకయొక్క ప్రగల్భమగు ప్రణయ ప్రకటనము. ఇట్లు రామాయణము-ఉత్తర రామచరితము-శాకుంతలము- ఇత్యాది కావ్యముల యందలి విప్రలంభ శృంగార వర్ణనములు అత్యంత మనోజ్ఞముగ నిరూపితములు. ఇందు విధియే ప్రేమికులకు విప్రలంభకారక మగును.

గీతగోవిందము నందలి విప్రలంభశృంగారము సమంజస మను నిశ్చయము మనకు కల్గదు. రాధాకృష్ణులకు వియోగమేల కల్గెనో దురూహ్యము. ఒకవేళ వియోగము కల్గినదని అంగీకరించినను వారి సమాగమమున గల పైయక్తికములగు ఈర్ష్య కలహములే కారణముగాక యింకేది కాగలదు? ఇట్లు విప్రలంభ శృంగారముయొక్క తీవ్ర స్థాయియే సన్నివేశ దార్ఢ్యము లేనందున లోపించుచున్నది. ఈ లోపము గ్రహించియే కాబోలు జయదేవుడు నిట్టూర్పులు. కన్నీరు. వీనితోడి గతానుభవముల యొక్క

స్మృతులను రాధకు కల్పించి ఆమె విలాపమును అతిశయముగ ప్రకటించెను. వాల్మీక్యాది కవుల నాయికానాయకులు విప్రలంభమునగాని సంయోగమునగాని తమ గౌరవాజాత్యములకు ననర్హమగు రీతిని ప్రవర్తింపరు. కాని జయదేవుని శ్రీకృష్ణుడు పౌరుషవిహీనుడుగ, చలచిత్తుడుగ ఉత్పథవర్తనుడగు యువకుడుగ— నిరూపింపబడెను. అతడు రాధ పాదములపై సాష్టాంగపడి "శిరస్యాధేహి మే పాదం...." అని ప్రార్థించుట కవితాకళ యొక్కయు, భగవద్విషయక వర్ణనము యొక్కయు అధికార సూత్రములకు భంగము కల్గించుటయే-మాటిమాటికి కృష్ణుని దివ్యత్వమును వ్యంజించు కంసధ్వంసన ధూమకేతుః - దేవకీనందనః - హరిః- ఇత్యాది శబ్దములను ప్రయోగించుటయందు తప్ప ఈ కావ్యమందు శ్రీకృష్ణుని దివ్యత్వముగాని. అభిజాత్యముగాని గోచరింపదు. దివ్యత్వము శబ్దములవరకే పరిమితము, తఱుచుగా దోచు క్షణప్రభలవలన పదార్థదర్శనముగాక ప్రగాఢ తమస్సులే వ్యాపించును గదా!

రాధకై విరహోత్కంఠితుడగు శ్రీకృష్ణుడు - ఇతర గోపికలతో విహరించుచున్నట్లు చిత్రింపబడుట అసంగతముగ దోచును. మానవ నాయకుల యందు సైతము ఇట్టి తాల్యము ప్రబలదోషము కాగా, భగవంతుడగు శ్రీకృష్ణుని విషయమున నిక చెప్పనేల? సంస్కృత మహాకావ్యములలో ఉత్తమనాయిక లెవరును అభిసారికలుగా చిత్రింపబడలేదు. ఇందు రాధిక అభిసారికగ వర్ణింపబడినది. విక్రమోర్వశీయమున ఊర్వశి అభిసారికగ కన్పించినను ఆమె 'సామాన్య'- అనుట విస్మరింపరాదు. మహాకవులు నాయకానాయకుల శృంగార విషయమున దాంపత్య శృంగారమునే వర్ణించిరి.

జయదేవుడు రాధాకృష్ణుల ప్రణయ వృత్తాంతమునంతయు కాముకీకాముకుల రహస్య ప్రణయముగ చిత్రించెను జగత్పితరుల విషయమున నిట్టి విశృంఖల శృంగార వర్ణనము అనుచితము; అసభ్యము. దీనిచే పాఠకులకు రాధాకృష్ణుల దివ్యత్వమున సంశయము కలుగక మానదు. ఉత్తమ దేవతా విషయమున ధర్మోల్లంఘనమగు విశృంఖల శృంగార వర్ణనమును సుప్రసిద్ధాలంకారికులు తీవ్రముగ నిరసించిరి. ఆలంకారిక చక్రవర్తియగు మమ్మటుడిట్లు విమర్శించెను. "ఉత్తమ దేవతల సంభోగ శృంగారమును వర్ణింపగూడదు అది తల్లిదండ్రుల సంభోగ శృంగార వర్ణనము వలె అత్యంత మనుచితము.

[ కిం తు రతిః సంభోగ శృంగార రూపోత్తమ దేవతావిషయా న వర్ణనీయా. తద్వర్ణనం హి పిత్రోః సంభోగవర్ణన మివాత్యంత మనుచితమ్".... కావ్యప్రకాశము. సప్తమోల్లాసము ]

ఆనందవర్ధనుడు ధ్వన్యాలోకమున మఱింత తీవ్రముగా నిట్టి శృంగారమును నిరసించెను. సాహిత్య దర్పణకారుడైన విశ్వనాథుడు ఈ ఆలంకారికుల అభిప్రాయమునే సమర్థించెను. జగన్నాథ పండితరాయలు రసగంగాధరమున గీతగోవింద కావ్యమును అతి తీవ్రముగ ఖండించెను.

" యత్రి సహృదయానాం ప్రమాణసిద్ధిః తత్రైవ సాధారణీ కరణస్య కల్పనాత్. అన్యథా స్వమాత్రవిషయక స్వపితృ రతివర్ణనేఽపి సహృదయస్య రసోద్భోధాపత్తేః"

[ ఏది సహృదయులు ప్రమాణముగా నంగీకరించిరో దానికే సాధారణీకరణ మొనర్ప దగును. లేనిచో స్వమాత్రవిషయకమైన స్వపితృ రతివర్ణనము కూడ సహృదయులకు రసోద్భోధ కల్గింప వచ్చును. ]

అనౌచిత్యము కంటె వేరు రసభంగ కారణం లేదని జగన్నాథుడు పేర్కొనెను.

[ "అనౌచిత్యా దృతే నాన్యత్ రసభంగస్యకారణం రసాఽౌచిత్య బంధస్తు రసస్యోపనిషత్ పరా." ]

ఇట్లు ప్రసిద్ధాలంకారికు లెల్లరును గీతగోవిందమున రసభంగము కలదని, దాని కావ్యత్వమును నిషేధించిరి. అలంకారములకు లక్ష్యముగా నీ కావ్యము గ్రహింపబడ లేదు. ఏ ఒకరిద్దరో ఇందలి శ్లోకములను తీసికొన్నను అవియంత పరిగణనీయములు కాజాలవు.

ఈ విమర్శలన్నియు పూర్వపక్ష వాదముగా భగవద్భక్తులు నిరసించి గీతగోవిందమును భక్తిరస ప్రధాన కావ్యముగా శిరసావహించిరి.

## సిద్ధాంత ప్రతిపాదనము

గీతగోవిందము భక్త్యాత్మకము. కళాత్మకము నగు భారతీయ జీవనమున మహత్తర ప్రభావమును జూపి అసంఖ్యాకులగు జనులను భగవత్సన్నిధికి ఆకర్షింప గల్గినది. ఇట్టి పథావలంబనము వ్యాస జయదేవులు స్వీకరింపకున్నచో ఇంద్రియ ప్రపంచ జీవనులగు సామాన్యులు భగవద్దూరులై యుండవలసి వచ్చెడిది. సాక్షాద్భగవదవతార మూర్తియు, భగవద్భక్తికి నిజ జీవితమును జీవవ్యాప్యముగా జేసిన చైతన్య మహాప్రభునకు సైతము గీతగోవింద కావ్యము శిరోధార్యమైన దనుట గమనింపదగినది. ఈ కావ్యమున మహాప్రభువునకు ఆదరాభిమానములు అసమానములు.

బ్రహ్మవైవర్త పురాణమునను బృహత్సంహితయందును, రాధాకృష్ణులు దంపతులని వర్ణింపబడియున్నది.—

"కృష్ణమాలా, కృష్ణశాలా, కృష్ణహృత్పద్మకర్ణికా
కృష్ణజీవాత్మికా, రాధా వృషభానుతనూద్భవా.

శ్రీకృష్ణనయనానంద రస కర్పూరవర్తికా
శ్రీకృష్ణానన పూర్ణేందో రాధికా చారుచంద్రికా.

శ్రీకృష్ణపదనాంభోజ మధుపాన మధువ్రతీ
అనయాऽऽరాధ్యతే కృష్ణో భగవాన్ హరిరీశ్వరః
లీలయా రసవాహిన్యా తేన రాధా ప్రకీర్తితా."

రాధాకృష్ణుల పరమాద్భుత ప్రణయమును గూర్చి ఈ స్తోత్రమండలి నామములు వ్యాఖ్యానించుచున్నవి.

జయదేవుడు "యది హరిస్మరణే సరసం మనో ...." [పుట 2 శ్లో 3] అను శ్లోకమున ఈ కావ్యమున ప్రధాన వస్తువు 'హరిస్మరణ'— మని ప్రప్రథముననే ఉద్ఘాటించెను. ఆయా గీతముల చివర జయదేవుడు కావ్యప్రధాన విషయము భగవంతుని 'అనుస్మరణ' మని స్థాపించియుందుట మననార్హము.

## దృష్టాంత నిరూపణ

ప్రాచీన మహర్షులు అనను భూతములగు ఆధ్యాత్మిక విషయములను మన అనుభవమందున్న విషయముల ద్వారా బోధించిరి. జయదేవకవియు దృష్టిగోచరమగు ప్రాకృతవిషయములను దృష్టాంతముగా స్వీకరించి అప్రాకృత విషయమగు భగవద్భక్తిని తనకావ్యమున నిరూపించెను, భక్తియను దివ్యౌషధమునకు ప్రాకృతజనుల అనుభవ మందున్న శృంగార మనెడి చక్కెర పూత బూసి లోకులకు గీతగోవింద కావ్యము నొసంగెను. తత్త్వజ్ఞులు భక్తిరసమయ గ్రంథముగా దీనినారాధింతురు. శృంగార రసానురక్తులగువారు దీనినే శృంగార కావ్యముగా నాదరింతురు. కాని గర్భితమైయున్న భక్తి రసాయనము కాలక్రమమున వారి హృదయములందు ప్రవేశించి వివేకమును గల్గించి భక్తిమార్గనిష్ఠులుగా జేయును.

"భక్తిః కామసమేతాఽపి కామాప్తే న నివర్తతే
శ్రద్ధా వృద్ధా పరే పుంసి భూయ ఏవాభివర్ధతే."

[ భక్తి కామసమేతమైనను కామసిద్ధి తర్వాత తొలగిపోదు. అది పరమేశ్వరుని యందు శ్రద్ధారూపమగు వృద్ధినిబొంది దివ్యప్రేమగా పరిణమించు చున్నది. ] అని భగవాన్ రమణమహర్షి వచించెను.

ఎట్లయినను పరమేశ్వరుని గూర్చిన ఉద్దామధ్యానము తత్ప్రాప్తికి హేతువగునని నారదాదుల సిద్ధాంతము.

'ఉద్దామధ్యాన గరిష్ఠుడైనహరిజెందన్వచ్చు ధాత్రీశ్వరా! (భాగవతము)

జయదేవుని గీతగోవిందము ఆత్మపరమాత్మల సంయోగమును వ్యంజించు ఒక రూపకము. (Allegery) వంగదేశము నందలి వైష్ణవశాఖకు ఇట్టి వర్ణనము పరమసమ్మతము. ఇట్టి పద్ధతి బైబులు గ్రంథమున సోలమన్ (Soloman) చక్రవర్తి విరచితమగు పరమగీతము (Song of Songs) నందును కాననగును. ఎడ్విన్ అర్నాల్డు (Edvin Arnold) అను ఆంగ్లకవి గీతగోవింద కావ్యమును ఆంగ్లమున అనువదించి దానికి భారతదేశపు పరమగీతము (Indian Song of Songs) అను పేరిడెను. భగవద్విషయకమగు రోచనము కల్పించుటకై మహర్షులీపద్ధతి నవలబించిరి. భాగవతమున "రోచనార్థా ఫలశ్రుతిః",— అని భగవద్విషయకమైన అభిరుచిని గల్పించుటయే ఫలశ్రుతి ప్రయోజనముగా జెప్పబడియున్నది

భక్తులు భగవద్విరహమున త్రిభువనమును వాసుదేవమయముగ భావింతురు.

"సంగమ విరహ వికల్పే వరమిహ విరహో, న సంగమ స్తస్య
ఏకస్స ఏవ సంగే, త్రిభువనమపి తన్మయం విరహే"

[ సంయోగ వియోగములందు వియోగము శ్రేష్ఠమైనది. సంగమమున అతడొకడే విరహమున త్రిభువనమును అతడే. ] ఇట్టి సంప్రదాయము సకలమత గ్రంథములందును గలదు.

There was a time when I was a woman and he was a man, Still love grew until there was neither he nor I; only I remember faintly there was a time when there were two;

But love came between and made them one.

— *Persian Sufi Poem.*

[ "తాను పురుషుడు నేను ఆడుదానను" అనుభావము ఒకప్పుడుండెను. తాను గానీ నేను గానీ లేని స్థితిని ప్రేమ పరిణమింప జేసినది. కాని ఒకప్పుడు 'మేమిరుపురము' అన్న అస్పష్టభావమును నేనిపుడుస్మరింతును. ఇరువురి నడుమ ప్రేమ వికసించి అద్వైత సిద్ధిని గల్గించి నది ]

దీనికి జాషువాగారి తెనుగు పద్యము:—

"తాను పురుషుండు నేనాడుదానగుచు
మనలు వారము తొల్లి, ప్రేమంబువచ్చి
మమ్ము నుభయుల గూర్చి యైక్యమ్మొనర్చె,
స్మృతిపథంబునఁ గన్పట్టు నివుడు నాకు".

గీతగోవిందము నందలి రాధికా విరహవేదనము పరమాత్మ సంయోగమునకై తహతహలాడు జీవుని ఆవేదన. శ్రీ వేంకటపార్వతీశ్వర కవులచే రచితమైన 'ఏకాంత సేవ'— అను గ్రంథ మీమార్గమున అపూర్వమైనది.

## శ్రీకృష్ణుడు — గోపికలు

భాగవతము ననుసరించి శ్రీకృష్ణుడు అస్ఖలిత బ్రహ్మచారి.

"రేమే రమేశో వ్రజసుందరీభి ర్యథార్భకస్స్వప్రతిబింబ విభ్రమః"

[ బాలుడు తన ప్రతిబింబముతో ఆడుకొనునట్లు రమానాథుడు వ్రజసుందరులతో క్రీడించెను. ] మృతి బొందిన ఉత్తరాసుతుని సజీవుని చేయుటకు.

"యది మే బ్రహ్మచర్యం స్యాన్మృతో జీవతు బాలకః".

అని భగవంతుడు ప్రతిజ్ఞ చేసినట్లు భారతమున వర్ణింపబడినది.

భాగవతము నందలి రాసపంచాధ్యాయి భగవత్పరమైనపరమ ప్రేమ స్వరూపమును వివరించుచున్నది. దీనిని పఠించినవాడు కామవిజేత కాగలడని ఫలశ్రుతి చెప్పుచున్నది.

"విక్రీడితం వ్రజవధూభిరిదం చ విష్ణోః
శ్రద్ధాన్వితో ను శృణుయా దనువర్ణయే ద్యః
భక్తిం పరాం భగవతి ప్రతిలభ్య కామం
హృద్రోగ మాశ్వపహినో త్యచిరేణ ధీరః".

[భాగ. ద. స్కం. అ, 33. శ్లో 41]

గోపికలు భగవద్జ్ఞానాన్వితలని భాగవతముచే తెలియుచున్నది.

"నఖలు గోపికానందనో భవాన్
అఖిలదేహినా మంతరాత్మదృక్"

అని గోపికలు శ్రీకృష్ణుని గూర్చి వచించిరి. గోపికాగీతము లన్నియు నీ సత్యమునే చాటుచున్నవి. భాగవతమున రాధ పేరు లేకున్నను గోపికాగీతము లందును, భ్రమరగీతములందును, ప్రధాననాయిక రాధయని భగవద్భక్తుల దర్శనము.

## రాధిక – పరాప్రకృతి

రాధికను దేవీభాగవత బ్రహ్మవైవర్తాది పురాణములు "ప్రాణాధిష్ఠాతృదేవి"-- అని వర్ణించినవి సప్రాణత్వము జీవలక్షణము. శ్రుతులు పరమాత్మను 'అప్రాణో హ్యమనాః'— ఇత్యాదిగా వర్ణించుచున్నవి. జీవతత్త్వము తన పరాప్రకృతి యనియు ఈశ్వరాంశ మనియు గీతయందు భగవంతుడు వచించెను. 'అహం బ్రహ్మాఽస్మి'— అనునది బృహదారణ్య శ్రుతియొక్క సందేశము 'అహం'- అన్నది రాధను 'బ్రహ్మ'- అనునది శ్రీకృష్ణుని నిర్దేశించుచున్నవి. ఈ వాక్యార్థము రాధాకృష్ణుల సమరసైక్యమును నిరూపించుచున్నది. గీతగోవిందము నందలి

'మధురిపు రహమితి భావన శీలా.... [పుట 68 గీ.5]

అను వాక్యము ఈ భావమునే సూచించు చున్నది

గీతగోవిందకావ్యమిట్టి పరమార్థమును బోధించు ప్రప్రథమ సంగీత నృత్య నాటిక. భగవద్భక్తి పరాయణులైన నారాయణతీర్థాదులపై దీని ప్రభావమెంతయు కలదు. కాన గీతగోవిందము నందు శృంగారపరమైన వాక్యార్థమును విసర్జించి లక్ష్యార్థమగు జీవపరమాత్మల రసలీలలు, అద్వైతసిద్ధిని భగవద్భక్తులు అనుసంధాన మొనరించుకొనవలెను.

## భక్తి రసము

గీతగోవింద కావ్యమందలి రసము శృంగారమనుట భగవద్భక్తుల మతమున వాచ్యార్థము లేక గౌణార్థము మాత్రమే. లక్ష్యార్థమున నీ కావ్యము భక్తిరస ప్రధాన

మయినది. భక్తిని రసముగా అంగీకరించుటకు సంప్రదాయ బద్ధులైన అలంకారికులు సమ్మతింపరు. జగన్నాథ పండితరాయలు సైతము భక్తిని రసముగా అంగీకరింపక పోవుట లౌకిక దృష్టిచేతనే అని పండితులు కొందఱు పేర్కొందురు. కాని వైష్ణవ భక్తులు, ఆలంకారికులు నగు రూపగోస్వామి జీవగోస్వామి మున్నగువారు రసవిధానము భగవంతుడనియు, పరమానందరూపమైన నది భక్తిగా నభివ్యక్తమగుననియు స్థాపించిరి. వీరికి పరమప్రమాణము — ఉపనిషత్తులు, నారదాది మహర్షుల పవిత్రగ్రంథములు 'రసోవై సః' — 'రసం హ్యేవాయం లబ్ధ్వా౽౽నందీ భవతి' (తైత్తిరీయోపనిషత్) భగవంతుడు కేవలము రసస్వరూపము. భగవంతుని పొందిన వారు మాత్రము పరమానందానుభూతిని పొందగలరు. 'భక్తిః రసరాట్'-మధుసూదన సరస్వతి తన 'హరిభక్తి రసాయనము'— అను గ్రంథమున భక్తికి రసత్వము నిట్లు స్థాపించెను.—

> శోకక్రోధభయాదీనం సాక్షాత్సుఖ విరోధినాం
> రసత్వ మభ్యుపగతం తథా౽నుభవమాత్రతః
> ఇహానుభవసిద్ధే౽పి సహస్రగుణితో రసః
> జడేనైవ త్వయా కస్మా దకస్మా దపలప్యతే ?

అనుభవ మాత్రమువలనే సాక్షాత్సుఃఖవిరుద్ధములయిన శోకక్రోధభయాదులకు రసత్వ మంగీకృతమై యున్నది. అనుభవసిద్ధమై మిగిలిన రసములకన్న వేయిరెట్లధికముగా రస్యమానమగుచున్న భక్తి. రసము గాదనుట యెట్లు?

> కాంతాది విషయా వా యే రసాద్యాస్తత్ర నేదృశం
> రసత్వం పుష్యతే పూర్ణసుఖాస్పర్శిత్వ కారణాత్.
> పరిపూర్ణరసా క్షుద్రరసేభ్యో భగవద్రతిః
> ఖద్యోతేభ్య ఇవాదిత్యప్రభేవ బలవత్తరా.

''కాంతాది విషయకములగు నేరసమునందును భగవద్రతియందువలె బూర్ణ సుఖము, లేక యానందము కలుగదు. కాన వానియందు దగిన రసపుష్టి లేదు. అవి క్షుద్ర రసములు, భగవద్రతి పూర్ణరసము. అది మిణుగురు పుర్వుల కన్న సూర్యకాంతి యెట్లు బలవత్తరమో, యట్లే మిగిలిన రసములకన్న శ్రేష్ఠతరము; బలవత్తరము''-- అనియును వచించెను. కావ్యాలంకార సంగ్రహము.

(నరసభూపాలీయము)

అని వైష్ణవుల సిద్ధాంతము. నారాయణతీర్థులు భక్తి చంద్రికయందిట్లు నిరూపించిరి.

"ఇత్థంచ లౌకికరసే శృంగారాదౌ విషయావచ్ఛిన్న స్యైవ చిదానందాంశస్య స్ఫురణా దానందాంశస్య న్యూనత్వం. భగవదాకారోక్త చేతోవృత్తిలక్షణే భక్తిరసేతు అనవచ్ఛిన్న చిదానంద ఘనస్య భగవతః స్ఫురణా దత్యంతాధిక్య మానందస్య. అతోభగవద్భక్తిరస ఏవ రస ఇతి పరమరసికైః సేవ్యః"

[లౌకికరసము లైన శృంగారాదులందు విషయావచ్ఛిన్నమయిన చిదానందాంశము యొక్క స్ఫురణము మాత్రమే. కాన యందు ఆనందమునకు న్యూనత్వమే కల్గుచున్నది. అట్లుగాక భగవదాకార చిత్తవృత్తి లక్షణాత్మకమైన భక్తిరసము నందు అనవచ్ఛిన్న చిదానందానుభవమున భగవంతుని యొక్క స్వరూపము సిద్ధించుటచే ఆత్యంతికమయిన ఆనందసిద్ధి కల్గుచున్నది. కాన భగవద్భక్తి రసము మాత్రమే అంగీకరింపదగినది. తక్కినరసము లుపేక్షణీయములు.]

## భక్తి శాంతముల కభేదము

భక్తిరసమునే శాంతమని భక్తిశాంతముల కభేదమును తత్త్వజ్ఞులు నిర్ణయించిరి- "శాంతరూపాత్ పరమానందరూపాచ్చ". అని దేవర్షి నారదుని సూత్రము అభినవ గుప్తుడు సైతము శృంగారాదులందు శాంతమె ఉపహితమై యుండుటచే వానియందు శాంతప్రాయమగు ఆనందము సిద్ధించుచున్నదని "తత్ర సర్వరసానాం శాంతప్రాయ ఏవాస్వాదః".— అని వచించెను. శమాత్మకమయిన రతియే భగవద్విషయకమై భక్తి రసమగు చున్నది.

అమృతానందయోగి అను మహాత్ముడు తన "అలంకార సంగ్రహము"-న శాంత రస స్వరూపము నిట్లు నిర్వచించెను.—

"శమ ఏవ విభావాద్యైః పుష్టః శాంతరసో యథా
ఆలంబనవిభావస్యా చ్ఛంభోస్త చ్ఛాశ్వతం పదం
ఉద్దీపనాస్తు వేదాంతవేది సంభాషణాదయః
అనుభావాస్తు కథ్యంతే సమదర్శనతాదయః
సాత్త్వికా స్తంభరోమాంచ ప్రముఖాః పరికీర్తితాః
సంచారిణోఽపి నిర్వేదమతి ధృత్యాదయో మతాః
శాంతః స్ఫటిక వర్ణోఽస్య పరబ్రహ్మాఽధిదేవతా".

గీతగోవింద కావ్యమున నాలంబన విభావము శ్రీకృష్ణభగవానుడు. ఉద్దీపనాదులు భగవద్విషయక సంకీర్తనాదులు-అనుభావములు సమదర్శనాదులు. స్తంభరోమాంచాదులు-సాత్త్వికభావములు. నిర్వేదాదులు సంచారీభావములు. శాంతరసము యొక్క వర్ణము స్ఫటికము అనగా అత్యంతనిర్మల మని భావము. శాంతమున కధిదేవత పరబ్రహ్మము భక్తిరసము నందును 'బ్రహ్మణో హి ప్రతిష్ఠాఽహమ్' - అను గీతావాక్యము ననుసరించి భగవంతుడు అధి దేవత వేదాంతదేశికులు సైతము శాంతరసప్రాధాన్యమును ఇతర రసముల రసాభాసత్వమును తన సంకల్ప సూర్యోదయ నాటకమున ప్రతిపాదించి యున్నారు.

భక్తిరసము మాధుర్య గుణ సంయుతము ఆలంకారికుల మతమున శృంగార హాస్య కరుణ శాంతములు మాధుర్య గుణయుక్తములని చెప్పబడియున్నను భక్తిరసమున నీ మాధుర్య గుణము అధికతరము.

"బంధా మృదు స్ఫుటోన్మిశ్ర వర్ణవిన్యాస యోనయః
సరసౌ యత్ర శబ్దార్థౌ మాధుర్యం శ్రుతిమోదకృత్".

అని మాధుర్యగుణము నిర్వచింపబడినది. గీతగోవిందకావ్యము మాధుర్యగుణ సంశోభిత మనుట రసజ్ఞులగు భావుకులకు వేఱుగ చెప్పనక్కఱలేదు.

## ఆధ్యాత్మిక సౌందర్యము

గీతగోవింద కావ్యమున ప్రధానవస్తువు హరిస్మరణమని గ్రహించితిమి. ఇక నీ కావ్యము నందలి ఆధ్యాత్మిక తత్త్వసౌందర్యమును పరిశీలింతము.

"విగళిత వసనం పరిహృతరసనం, ఘటయజఘనమపిధానమ్"

ఈ గీతము అవధూత పరిస్థితిని వివరించుచున్నది. అవధూత యనగా విముక్తాత్ముడని యర్థము, ప్రాపంచిక రాగములను బాధలను విసర్జించి ఈశ్వరస్థితిని అధిగమించినవాడని భావము. అవధూతస్థితి పరమత్యాగమును నిర్దేశించుటయే గాక రాగాదుల నతిక్రమించిన పరమ భూమిక. ఇట్టి స్థితి యందు ఏ నియమనిబంధన లుండవు.

"నిస్త్రైగుణ్యేపథి విచరతాం కోవిధిః కో నిషేధః"—

నిస్త్రైగుణ్య పథమున విహరించువారికి విధినిషేధము లేముండును? రాధికాదేవి స్థితి యీ పరమ భూమికను నిర్దేశించుచున్నది.

"హరిరభిమానీ రజని రిదానీ మియమపి యాతి విరామమ్,"

[పు. 62 గీ.17]

ఈ గీతమున 'హరిః అభిమాని'— అనగా హరి ప్రాణికోటుల సంరక్షణలో అభిమానము కలవాడు రజని-అనగా అజ్ఞానావృతమైన జన్మము. 'ఇయమపియాతి'— ఇట్టి జన్మము కూడ గడచిపోవు చున్నది. జన్మాంతర సహస్రము లిట్లు వ్యర్థమైచనినివి. ఈ జన్మము నైనను వ్యర్థపఱుపక రక్షించుకొనుము. నిన్నురక్షింప ప్రీతితో నీకై నిరీక్షించు భగవంతుని పిలుపునాలకించి దరిజేరుము.— ఇందు దూతిక గురుస్థానమున నున్నది. భక్తుని పరిస్థితిని భగవంతునికి దెలిపి భగవత్సంబంధమయిన జ్ఞానమును, ప్రేమను భక్తునికి సాక్షాత్కరింపజేయు వాడు గురువు. గీతగోవిందము నందలి దూతిక చేసిన దీపనియే.

'ముహు రవలోకిత మండనలీలా
మధురిపు రహమితి భావనశీలా...."

[పు. 68 గీ.5]

ఈ గీతము భగవద్భక్తుని తన్మయావస్థను అభివర్ణించుచున్నది 'అహం బ్రహ్మాఽస్మి'— అను మహా వాక్యార్థమిట అనుసంధింపదగినది.

'శ్లిష్యతి చుంబతి జలధరకల్పం
హరి రుపగత ఇతి తిమిరమనల్పమ్....'

[పు. 68 గీ,7]

ఈ గీతము 'సర్వం విష్ణుమయం జగత్'—అను అద్వైత భావశిఖరము యొక్క పరాకాష్ఠను దెలుపుచున్నది.

"సంచరదధర సుధామధురధ్వని-
ముఖరిత మోహన వంశమ్ '

[పు. 68 గీ. 28]

ఈ గీతము భగవంతుని సుమధుర మనోజ్ఞరూపమును సాక్షాత్కరింప జేయు చున్నది. ఇది భగవద్భక్తుల ధ్యానమున కాలంబనము.

"అనిలతరళ కువలయ నయనేన
తపతి నసా కిసలయ శయనేన .."

[పు, 68 గీ.28]

అనునది భగవదనుగ్రహము పొందిన ధన్యాత్ముల స్థితిని వర్ణించు చున్నది. ఈశ్వరానుభూతి పొందినవారికి భౌతికవిషయవాంఛలుండవని, చిత్తజములైన వికారములు వారిని బాధింపవని భావము. 'మకరందం పిబన్ భృంగః గంధం నాపేక్షతే యథా'--

అనునట్లు అట్టివారికి నశ్వరములయిన విషయవాసనలు జుగుప్సావహములగును. ఇట్లె న్నేవియు భక్తిపరముగ నీ గీతముల నన్వయింపవచ్చును.

సాంసారికమై క్షుద్రమయిన కామమును సహితము పరమేశ్వర పరమానురక్తిగా పరిణమింపజేయు విధానమును జయదేవ మహాకవి ఈ కావ్యమున నిర్దేశించినాడు.

దిక్ప్రదర్శనముగ ఈ కావ్యవైశిష్ట్యము తెలుపబడినది. రసజ్ఞులైన పండితులు దోషములను మన్నించి సారదిదృక్షువగు హంసవలె గుణమును మాత్రము గ్రహింపవలయునని ప్రార్థించుచున్నాను.

'జయంతి తే సుకృతినో రససిద్ధాః కవీశ్వరాః
నాస్తి తేషాం యశఃకాయే జరామరణజం భయమ్'.

: **ఈశ్వరో జయతి** :

దుందుభి; చైత్ర; శుద్ధ పంచమి.
30—3—1982
అనంతపురం.

సుధీవిధేయుడు,
యల్. నారాయణ

## ఉపయుక్త గ్రంథములు


1 Volumes of Kalyana Kalpataruvu
2 భక్తమాల
3 భక్తవిజయము
4 సీతారామాంజనేయ సంవాద కావ్యము - ఒక సమాలోచనాత్మక పరిశీలనము (రాజయోగదర్శనము)
5 కావ్యాలంకార సంగ్రహము (నరసభూపాలీయము) తదితర గ్రంథములు.

# సర్గలు; అందలి విషయములు

ఈ కావ్యమున సర్గలు 12. అష్టపదులు 24, శ్లోకములు 90 కలవు. ప్రథమ సర్గ సామోదదామోదరము. ఆమోద సహితుడైన దామోదరునితో కూడినది. కావ్యము వసంతవన వర్ణనముతో ప్రారంభమగుచున్నది. శ్రీకృష్ణునకై నిరీక్షించెడి రాధతో చెలికత్తె "సానందవ్రజ భామినుల్ దనను ప్రత్యంగంబు జుట్టన్ వసంతానన్ మన్మథ మన్మథుండు హరి మోదంబార క్రీడించెడిన్." అని తెలియజేయును. శ్రీకృష్ణుడు గోపికలతో కూడి సంతుష్టుడై యుండుటచే నీసర్గ సామోదదామోదరమైనది.

ద్వితీయసర్గ అక్లేశకేశవము. రాధిక విషాదమున ఇతః పూర్వము తనకు శ్రీకృష్ణునితో జరిగిన సమాగమ సన్నివేశము పరవశత్వమున స్మరించి, ఎట్లైనను గోవిందుని పొందు సమకూర్చి పుణ్యము గట్టుకొమ్మని చెలిని ప్రార్థించును.

తృతీయసర్గ ముగ్ధమధుసూదనము. ముగ్ధుడైన మధుసూదనునితో కూడినది. "గోపికలతో కూడియున్న నన్నుజూచి రాధ నిరాశజెంది వెడలిపోయెనని. అందుకు తన నిర్లక్ష్యమే కారణమని శ్రీకృష్ణుడు పశ్చాత్తాపపడును. "నన్ను క్షమియించు దేవి........ పంచబాణుడు నన్ను దహించుచుండె". అని రాధను దలంచుచు వ్యథజెందును.

చతుర్థసర్గ స్నిగ్ధ మధుసూదనము. చెలికత్తె విరహవిహ్వలమైన రాధ యొక్క దైన్యావస్థను శ్రీకృష్ణునకు విన్నవించును. "ధ్యానమున నీలో దాగెను రాధ ......."— అని పల్కును. నిజమునకు రాధాకృష్ణుల ప్రణయము భక్తునకు దేవునకుగల సంబంధము వంటిది. భక్తుడు ధ్యానమున దేవునియందే లీనమైయుండు నట్లు రాధ కృష్ణునియందే లీనమైయున్నది. అందుచే కృష్ణుడు స్నిగ్ధుడు. అనగా మనోహరుడు. కాన ఈసర్గ స్నిగ్ధ మధుసూదనమైనది.

పంచమసర్గ సాకాంక్ష పుండరీకాక్షము. ఇందు పుండరీకాక్షుడు ఆకాంక్షా సహితుడు. రాధపై శ్రీకృష్ణునకు గల ప్రేమాతిశయమును ఈసర్గ వివరించును. "నా మాటలుగ ఆమె కోపమునుపోగొట్టి వెంటగొని రమ్మని గోవిందుడు చెలికత్తెను పంపును. ఆమె పుండరీకాక్షుని విరహ తాపమును రాధ యొద్ద సరసముగ వర్ణించి "రాజీవనయను కామితంబును దీర్ప వేగముగ లెమ్ము."— అని శ్రీకృష్ణుని జేర రాధను ప్రోత్సహించును.

షష్ఠసర్గ: ధన్య వైకుంఠ కుంకుమము. ధన్యుడు, వైకుంఠమునకు అలంకార భూతుడునైన శ్రీకృష్ణునితో కూడినది. కృష్ణ వియోగమున రాధ నడచుటకుగూడ అశక్తయై యుండును. "దర్పకు చింతచేత మున్గినది రసాబ్ధి యందు"— అనుచు సఖి ఆమె అవస్థను గోవిందునకు తెలిపి రాధను గాపాడుమని ప్రార్థించును.

సప్తమసర్గ: నాగర నారాయణము. నగరమునకు సంబంధించినది నాగరము. అట్టి జ్ఞానముతో కూడిన నారాయణుని గల్గినది. నారాయణుడిట నాగరకుడు తనకై యెదురు చూచుచున్న రాధను జేరుటకు గోపాలు డాలసించెను. చూచి చూచి వేసారిన రాధ "ఔర! వేఱొక్క కాంతకై యరిగె నేమొ;

మసలెనో కాక చుట్టాల మాటలందు;

నన్ను జీకట్ల వెదకు చున్నాడొ; రాక

పోయె పొదరింటి కస్వస్థు డాయె నేమొ?" — అని

పలువిధముల నాశంకించును. మాధవు చెంత నుండి చెలికత్తె యొక్కతె వచ్చును. వాడియున్న దాని ముఖమును జూచి రాధ గోపాలుం డన్యకాంతా సహితుడై యున్నట్లు భావించి వారి ప్రణయ లీలలను వర్ణించును. ఆమె అదృష్టమును కొనియాడును. మన్మథ మలయవాయువులను నిందించును. నీళ్లతో శరీరమును దడిపి తాపమును పోగొట్టుమని యమునానదిని వేడుకొనును.

అష్టమసర్గ: విలక్షలక్ష్మీపతి. విలక్షుడైన లక్ష్మీపతిని గల్గినది. విలక్షుడు-విభ్రాంతి జెందినవాడు, అది ఉదయము. రాత్రి యంతయు రాధ శ్రీకృష్ణవిరహమున జాగరణము చేసినది. కృష్ణునిజూడ ఆతురత పడుచున్నది. కృష్ణుడేతెంచి ఆమె పాదములకడ మోకరిల్లినాడు. కాని రాధ కోపముతో గోపాలుని నిందించును. "ఎవతె నీదు వేదన హరియింపగలదొ, ఆమె దగ్గరకే తిరిగివెళ్ళు" మని పల్కును. లక్ష్మీపతి విలక్షుడయ్యెను.

నవమసర్గ: ముగ్ధముకుందము. ముగ్ధుడైన ముకుందునితో కూడినది. కృష్ణుడు వెడలి పోయిన పిమ్మట రాధ తన తొందరపాటునకు పశ్చాత్తాపపడును. "శ్రీకృష్ణుడు మరల యేతెంచి నీకు ముదము చేకూర్చు"నని చెలికత్తె రాధను ఓదార్చును.

దశమసర్గ: చతుర చతుర్భుజము. చతురుడయిన చతుర్భుజుని గల్గినది. అది సాయంసమయము. రాధ కోప పరవశయైయుండును గోపాలు డేతెంచెను. రాధ నెచ్చెలి మోము జూచును. కోపము వదలి పెట్టుమని, నిజముగ నావలని తప్పున్న దండించుమని కృష్ణు డామెను బ్రతిమాలును. చివరకు "చరణ పల్లవముంచు నా శిరము నందు"— అని బ్రతిమాలును. కలహాంతరితను ప్రసన్నను జేసికొనుటలో చతురతను ప్రదర్శించుట నీసర్గ చతుర చతుర్భుజమైనది.

ఏకాదశసర్గ: సానంద దామోదరము. సంతుష్టుడైన దామోదరునిలో కూడినది. కృష్ణుడు రాధను అనునయించి తన కుటీరము జేరినాడు. రాత్రి యైనది. రాధ సాలంకృతయైనది. ఆలస్య మొనర్పుచుండ నెచ్చెలి రాధను ప్రోత్సహించినది. రాధ కృష్ణుడున్న కుటీరమును జేరినది. పొదరింట వాకిట విభుని గాంచి సిగ్గుపడినది. సఖి "భయమేల ? త్వత్కటాక్ష వీక్షణముల దాసుడై చరణ కంజయుగంబు భజించు చుండగన్"—అని ధైర్యము జేకూర్చినది. కేళికా గృహమున రాధ మెల్లన కాలు మోపినది. తనకై నిరీక్షించు ప్రియుని ప్రియమార కనుగొన్నది. చెలులు వారి కేకాంతము గల్పించినారు. మాధవుడు రాధను కౌగిట గారవించినాడు.

ద్వాదశసర్గ; సుప్రీత పీతాంబరము. బాగుగ ప్రీతుడైన పీతాంబరుని గల్గినది. ఇందు రాధామాధవుల ప్రణయలీలా విహారము, సరస సంభాషణము, మనోజ్ఞముగ వర్ణింపబడినది.

కావ్యము గీతగోవిందము. గానము చేయబడిన గోవిందుని కల్గినది. గాన మొనర్చువారు భక్తులు. కావ్య మతి మధురము. శృంగార రస నిర్భరము. భక్తిభావ నిగూఢము.

ఇది రెండు దినముల కథ. మొదటి దినమున గోపికలతో విహరించుచున్న కృష్ణుని రాధకు జూపినది చెలికత్తె. కృష్ణునితో గడపిన మధురక్షణముల స్మరించి మరల గోవిందుని పొందు సంధించుమని ప్రార్థించినది రాధ. సఖి రాధిక దీనావస్థను కృష్ణునకు తెలియ జేసినది. కృష్ణుడు తన ప్రేమను వెల్లడించి రాధను పిలుచుకొని రమ్మనెను. కాని రాధ విరహముచే నత్యంతము డస్సి యుండుట కృష్ణునిచేర నశక్తయైయున్నది. ఆమె నెట్లయినను గాపాడుమని చెలికత్తె కృష్ణునివేడినది. చంద్రోదయానంతరము వచ్చెదనని కృష్ణుడు మాట యిచ్చినాడు. రాధ గోపాలునకై నిరీక్షించి విసిగివేసారి మలయానిల చంద్రాదులను నిందించినది.

రెండవ దినము కథ. ఇది 8వ సర్గతో ప్రారంభించును. కృష్ణుడేతెంచి తన తప్పును క్షమింపుమని ప్రార్థించును రాధ కోపమున కృష్ణుని నిందించి వెడల గొట్టును. తరువాత తన తొందరపాటుకు పశ్చాత్తాపపడును. మరల సాయంకాలమున మాధవుడు రాధ కడకేతెంచి తనను అనుగ్రహింప వేడుకొని నిజాలయమున కేగును. రాధ యారాత్రి అభిసారికయై గోవిందుని జేరును. రాధామాధవులు ప్రేమ నానందాంబుధి నోలలాడుదురు.

# నివేదన

1954లో శ్రీ మళయాల స్వామివారి ఆశ్రమమున (ఏర్పేడు చిత్తూరు జిల్లా) విద్యాభ్యాస మొనర్చునపుడు, భారతి మాసపత్రికయందు "నిభృత నికుంజ గృహం గతయానిశి రహసి నిలీయ వసంతం"—అను అష్టపది సతాత్పర్యముగ చూచుట తటస్థించినది. ఆ గీతము నన్నెంతో ఆకర్షించినది. గీతగోవింద కావ్యము తెప్పించుకొని సవ్యాఖ్యానముగ చదువనారభించితిని. ఆ గ్రంథముపైగల శ్రద్ధాసక్తులు నన్నీ అనువాద కార్యమునకు పురిగొల్పినవి. అనువాదము కత్తిపై సామువంటిదనుట భావుకులకు తెలియనిది గాదు. నా యీ రచన రసికులకేమాత్రము ఆమోదపాత్రమైనను నాకృషి ఫలవంతమని తలంచెద. ఈ నాటికీ గ్రంథము తిరుమల తిరుపతి దేవస్థానమువారి ఆర్థిక సహాయముచే ప్రచురించు నవకాశము కల్గినది. ఇందుకు కారకులయిన టి. టి. డి. ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్ శ్రీ *P V. R. K.* ప్రసాద్ I.A.S. గారికి, సప్తగిరి సంపాదకులైన శ్రీ కె. సుబ్బారావు M.A., గారికి నా నమస్సుమములు.

టి. టి. డి. వారి ఆర్థిక సహాయపద్ధతిని తెలిపి నన్నందుకై ప్రేరేపించిన సహృదయులు డా॥ ఆర్. చంద్రశేఖరరెడ్డి M.A., Ph. D. (లెక్చరర్ : ఆంధ్రశాఖ. శ్రీకృష్ణదేవరాయ విశ్వవిద్యాలయము. అనంతపురం.) గారికి నా నమోవాకములు.

పింఛసౌందర్యంతో కావ్యసౌందర్యము నినుమడింపజేసిన పూజ్యులు డా॥ తుమ్మపూడి కోటీశ్వరరావు M.A., Ph. D. (రీడర్, ఆంధ్రశాఖ. శ్రీకృష్ణదేవరాయ విశ్వవిద్యాలయము. అనంతపురం.) గారికి నా కృతజ్ఞతాభివందనములు.

కావ్యమును సాంతము పరిశీలించి తగిన సవరణలు సూచించియు సలహాల నిచ్చియు ప్రోత్సహించిన పూజ్యులు డా॥ రత్నాకర బాలరాజు M.A., Ph. D. (లెక్చరర్; ఆంధ్రశాఖ. ప్రభుత్వకళాశాల, అనంతపురం.) గారికి హృత్పూర్వక నమస్కారములు.

గ్రంథమును అందముగా తీర్చిదిద్దిన శారదా ప్రింటింగ్ ప్రెస్ యజమానులకు, వారి సిబ్బందికి కృతజ్ఞతలు.

—అనువాదకుడు.

# అంకితము



శ్రీ కరుణాంభోధికి ల
క్ష్మీకర దరహాస వదనజిత చంద్రునకున్
లోకత్రయ పూజితునకు
నాకాధిపవందితచరణద్వంద్వునకున్.

నరునకు రథసారథియై
వరగీతామృత రసప్రవాహమున శివం
కరుఁడై లోకము నేలిన
పరమదయానిధికి పతికి పరమాత్మునకున్.

శ్రీ రాధా హృన్నిలయుని
హారునకు సమస్తవాఙ్మయాతీతునకున్
నారదమునీంద్ర సన్నుత
చారుచరిత్రునకు భక్తజన సులభునకున్.

యుగయుగమున ధర్మము నిలు
పగనెంతయు ధరణిపై నవతరించి కడున్
జగములఁ బ్రోచెడి ప్రోడకు
నిగమప్రతిపాద్యమాన నిఖిలాత్మునకున్.

జలదశ్యామల మూర్తికి
కలియుగమున నేడు భక్తకల్పద్రుమమై
ఇల వేంకటాచలంబున
వెలసిన దేవునకు హరికి వేంకటపతికిన్.



# విషయ సూచిక

| సర్గలు | | పుటలు |
|---|---|---|
| ప్రథమ సర్గము; | సామోదదామోదరము | 3 |
| ద్వితీయ సర్గము; | అక్లేశకేశవము | 27 |
| తృతీయ సర్గము; | ముగ్ధమధుసూదనము | 37 |
| చతుర్థ సర్గము; | స్నిగ్ధమధుసూదనము | 45 |
| పంచమ సర్గము; | సాకాంక్షపుండరీకాక్షము | 55 |
| షష్ఠ సర్గము; | ధన్య వైకుంఠ కుంకుమము | 67 |
| సప్తమ సర్గము; | నాగర నారాయణము | 73 |
| అష్టమ సర్గము; | విలక్షలక్ష్మీపతి | 90 |
| నవమ సర్గము; | ముగ్ధముకుందము | 99 |
| దశమ సర్గము; | చతుర చతుర్భుజము | 105 |
| ఏకాదశ సర్గము; | సానందదామోదరము | 113 |
| ద్వాదశ సర్గము; | సుప్రీత పీతాంబరము | 131 |



# అష్టపదీ సూచిక





# గీత గోవింద కావ్యము



సంస్కృతమూలము

శ్రీ జయదేవ కవి



ఆంధ్రీకరణము

యల్. నారాయణ

# గీత గోవింద కావ్యమ్

## — ప్రథమ సర్గః —

## — సామోద దామోదరః —

1

మేఘై ర్మేదుర మంబరం వనభువః శ్యామా స్తమాల ద్రుమై ః
న క్తం భీరు రయం త్వమేవ తదిమం రాధే! గృహం ప్రాపయ,
ఇత్థం నందనిదేశిత శ్చలితయోః ప్రత్యధ్వ కుంజద్రుమం
రాధామాధవయో ర్జయంతి యమునాకూలే రహః కేళయః.

2

వాగ్దేవతా చరిత చిత్రిత చిత్తసద్మా
పద్మావతీ చరణ చారణ చక్రవర్తీ,
శ్రీవాసుదేవ రతికేళి కథా సమేత
మేతం కరోతి జయదేవ కవిః ప్రబంధమ్

3

యది హరిస్మరణే సరసం మనో
యది విలాస కళాసు కుతూహలం,
మధుర కోమల కాంత పదావలీం
శృణు తదా జయదేవ సరస్వతీమ్,

[వాచః పల్లవయ త్యుమాపతిధరః సందర్భ శుద్ధిం గిరాం
జానీతే జయదేవ ఏవ శరణః శ్లాఘ్యో దురూహ ద్రుతేః
శృంగారోత్తర సత్ప్రమేయ రచనై రాచార్య గోవర్ధన -
స్పర్ధీ కోఽపి న విశ్రుతః శ్రుతిధరో ధోయీ కవిక్ష్మాపతిః]

# గీత గోవింద కావ్యము

## — ప్రథమ సర్గము —

## — సామోద దామోదరము —

అంబర మభ్రసాంద్రము, వనాంతరభూమి తమాల భూజనై
ల్యం.బిఁక రాత్రి. వీడతి భయస్థుఁడు, జేరుపు మీవె రాధ!గే
హం బన నందు,ఁడేగుచు నయంబున రాధయుఁ గృష్ణుఁడున్ నితాం
తంబు సుఖంబునందు యమునా తటకేళులు శోభిలుంగడున్.

2, 3

సరస వాగ్దేవతా చరిత చిత్రిత రమ్య
చిత్త సద్మండయి చెలఁగువాఁడు,
రమణి పద్మావతీ కమనీయ చరణ చా
రణ చక్రవర్తియై మనినవాఁడు,
శ్రీరాధికా కృష్ణశృంగార కేళీక
థా సముపేతమై తనరు నట్టి
రసవత్ప్రబంధంబు రచియించి మించెను
'జయదేవుఁ'డను కవి చక్రవర్తి
హరి కథలయందు మానస మలరునేని,
సురుచిర విలాసకళల తత్పరత యేని,
అవధరింపుఁడు జయదేవ కవివతంసు
లలిత కాంత పదావలీ కలితవాణి.

4

## అష్టపదీ 1

ప్రళయ పయోధిజలే ధృతవానసి వేదం
విహిత వహిత్ర చరిత్ర మఖేదమ్.
కేశవ ! ధృతమీన శరీర !
జయ ! జగదీశ ! హరే ! .... ధ్రువమ్.

5

క్షితి రతివిపులతరే తవ తిష్ఠతి పృష్ఠే
ధరణి ధరణకిణ చక్రగరిష్ఠే,
కేశవ ! ధృతకచ్ఛప రూప !
జయ ! జగదీశ ! హరే !

6

వసతి దశనశిఖరే ధరణీ తవ లగ్నా
శశిని కలంక కలేవ నిమగ్నా.
కేశవ ! ధృతశూకరరూప !
జయ ! జగదీశ ! హరే !

7

తవ కరకమలవరే నఖ మద్భుతశృంగం
దళిత హిరణ్యకశిపుతను భృంగమ్
కేశవ ! ధృతనరహరిరూప !
జయ జగదీశ ! హరే !

## అష్టపది 1

4

జయము కేశవ ! ప్రళయ జలధిని
సంచరింపవె లీవ నావగ.
మించి వేదగణంబు జేకొని
మీనరూపమున.

5

జయము కేశవ ! ధరణి ధరణ
క్షమకిణాంకిత విపులతరపృ -
ష్ఠమున ఘనముగ క్షితిని మోయవె
కమఠ రూపమున.

6

జయము కేశవ ! దంష్ట్రములపై
చక్కగా నిల్పవె ధరిత్రిని,
చూడఁ జంద్రునిలోని మచ్చగ
క్రోడ రూపమున.

7

జయము కేశవ! కరకమలనఖ
చయము చేత హిరణ్యకశిపు శ -
రీరభృంగముఁ జీల్చితివి గద
నారసింహుఁడవై.

8

ఛలయసి విక్రమణే బలి మద్భుతవామన!
పదనఖనీరజ జనిత జనపావన!
కేశవ ! ధృత వామనరూప! (౬)
జయ జగదీశ! హరే !

9

క్షత్రియ రుధిరమయే జగ దపగతపాపం
స్నపయసి పయసి శమితభవతాపమ్,
కేశవ ! ధృతభృగుపతి రూప ! (౬)
జయ జగదీశ ! హరే ! ....

10

వితరసి దిక్షు రణే దిక్పతి కమనీయం
దశముఖ మౌళి బలిం రమణీయమ్,
కేశవ ! ధృతరామ శరీర ! (౭)
జయ జగదీశ ! హరే ! ....

11

వహసి వపుషి విశదే వసనం జలదాభం
హల హతిభీతి మిళితయమునాభమ్,
కేశవ ! ధృతహలధర రూప ! (౮)
జయ జగదీశ ! హరే !

8

జయము కేశవ! పాద నఖ జల
జనిత జన పావన! క్రమంబున,
బలిని వంచింపవె మహాద్భుత
వామనాకృతిని. (౫)

9

జయము కేశవ! స్నాతఁ జేసితి
క్షత్రియుల రక్తంపు మడుగుల
పాపభారము దీరఁ బుడమిని
పరశురాముఁడవై. (౬)

10

జయము కేశవ! దిక్పతులు గడు
సంతసింపఁగఁ బంక్తికందు శి -
రములు బలివెట్టితివి దిశలకు
రామ రూపమున. (7)

11

జయము కేశవ! నీరదాభ వ –
సనము దాల్చితి హలభయంబున
వచ్చి చేరిన 'యమున' యన బల –
భద్రరూపమున. (౮)

12

నిందసి యజ్ఞవిధే రహహ ః శ్రుతిజాతం
సదయ హృదయ దర్శితపశుఘాతమ్.
కేశవ ! ధృతబుద్ధ శరీర !
జయ జగదీశ ! హరే ! ....

13

మ్లేచ్ఛ నివహ నిధనే కలయసి కరవాలం
ధూమకేతు మివ కిమపి కరాలమ్.
కేశవ ! ధృతకల్కి శరీర !
జయ జగదీశ ! హరే !

14

శ్రీ జయదేవకవే రిద ముదిత ముదారం
శ్రుణు సుఖదం శుభదం భవసారమ్.
కేశవ ! ధృత దశవిధ రూప !
జయ జగదీశ ! హరే !

15

వేదా నుద్ధరతే జగన్నివహతే భూగోళ ముద్విభ్రతే
దైత్యం దారయతే బలిం ఛలయతే క్షత్రక్షయం కుర్వతే.
పౌలస్త్యం జయతే హలం కలయతే కారుణ్య మాతన్వతే
మ్లేచ్ఛాన్ మూర్ఛయతే దశాకృతికృతే కృష్ణాయ తుభ్యం నమః.

12

జయము కేశవ! యజ్ఞములఁ బశు
చయ వధంబు విధించు శ్రుతిభా
గముల గతి నిందించితివి, లో
కమున బుద్ధుఁడవై. (9)

13

జయము కేశవ! తోఁకచుక్కగ
భయద మగు ఖడ్గము ధరించెదు,
ఖలుల నెఱయ సంహరింపఁగఁ
గల్కిరూపమున. (10)

14

జయము కేశవ! సంసార సార ఘనము
కరము సుఖదము జయదేవకవి కృతంబు
పరమరమణీయ మిది శుభప్రదము స్తోత్ర
మవధరింపుము దేవ! దశావతార!

15

ఘనతం గాచి శ్రుతుల్ - ధరించి జగతిన్ - క్ష్మాగోళమున్మోసి - దైత్యుని ఖండించి - బలిం గుదించి - నృపులం దున్మాడి - నిర్జించి రావణుఁ - జేఁబూని హలంబుఁ - బ్రాణికరుణాప్రాధాన్యముం జూపి - దుర్జనులం ద్రుంచు, దశావతారుఁడగు కృష్ణా! నిన్నుఁ గీర్తించెదన్.

అష్టపది 2

16

శ్రితకమలా కుచ మండల!
ధృత కుండల! ఏ
కలిత లలిత వనమాల!
జయ జయ దేవ! హరే! .... ధ్రువమ్

17

దినమణి మండల మండన!
భవ ఖండన! ఏ
మునిజన మానస హంస!
జయ జయ దేవ! హరే!

18

కాళియ విషధర గంజన!
జనరంజన ఏ
యదుకుల నలిన దినేశ!
జయ జయ దేవ! హరే!

19

మధు ముర నరక వినాశన!
గరుడాసన! ఏ
సురకులకేళి నిదాన!
జయ జయ దేవ! హరే!

## అష్టపది 2

16

శ్రిత రమా కుచ మండలా ! సం
ధృత మనోహర కుండలా !
కలిత నవ వనమాల ! మం
గళము శ్రీనారాయణా !

17

ద్యుమణి మండల మండనా ! భవ
దురిత సంచయ ఖండనా !
మౌని మానస హంస ! శ్రీ
మహిత ! జయనారాయణా !

18

కాళియాహి వినాశకా ! శ్రీ
కాంత ! సజ్జన పోషకా !
యదుకులాబ్జ దినేశ ! దై
త్యారి ! జయ నారాయణా !

19

నరక మధు మురనాశనా ! శ్రీ
కర ! ఖగేశ్వర వాహనా !
అమరహర్ష నిదాన ! శ్రీ
రమణ ! జయ నారాయణా !

20

అమల కమల దళలోచన!
భవమోచన! ఏ
త్రిభువన భవన నిధాన!
జయ జయ దేవ! హరే!

21

జనక సుతా కుచ భూషణ!
జిత దూషణ! ఏ
సమర శమిత దశకంఠ!
జయ జయ దేవ! హరే!

22

అభినవ జలధర సుందర!
ధృతమందర! ఏ
శ్రీముఖ చంద్రచకోర!
జయ జయ దేవ! హరే!

23

తవ చరణే ప్రణతా
వయ మితి భావయ ఏ
కురు కుశలం ప్రణతేషు
జయ జయ దేవ! హరే!

[శ్రీ జయదేవ కవేరిదం కురుతే ముదం ఏ,
మంగళ ముజ్జ్వల గీతి జయ జయదేవ! హరే!]

20

పద్మ పత్ర విలోచనా ! భవ
పాశ బంధ విమోచనా !
త్రిభువనైక నిధాన ! ఆ
ర్తిహర ! జయ నారాయణా !

21

నవ్య జలధర సుందరా ! సం
భావ్యగుణ ! ధృతమందరా !
శ్రీముఖేందు చకోర ! సు
శ్రీద ! జయ నారాయణా !

22

జానకీ కుచ భూషణా ! దూ
షణ మహాసుర నాశనా !
రణ శమిత దశకంఠ ! శ్రీ
రామ ! జయనారాయణా !

23

నమ్మితిమి త్వ త్పాదముగ ప
ద్మమ్ములే శరణంచును,
దాసులను దయఁ జూడు ల
క్ష్మీశ! జయ నారాయణా !

24

పద్మాపయోధర తటీ పరిరంభ లగ్న
కాశ్మీర ముద్రిత మురో మధుసూదనస్య,
వ్యక్తానురాగ మివ ఖేల దనంగఖేద
స్వేదాంబుపూర మనుపూరయతు ప్రియం వః.

25

వసంతే వాసంతీ కుసుమ సుకుమారై రవయవైః
భ్రమంతీం కాంతారే బహువిహిత కృష్ణానుసరణామ్.
అమందం కందర్ప జ్వర జనిత చింతాకులతయా
చలద్బాధాం రాధాం సరస మిద మూచే సహచరీ.

అష్టపదీ 3

26

లలిత లవంగ లతాపరిశీలన కోమల మలయసమీరే
మధుకర నికర కరంబిత కోకిల కూజిత కుంజ కుటీరే.
విహరతి హరిరిహ సరసవసంతే నృత్యతి
యువతిజనేనసమం సఖి ! విరహి జనస్య దురంతే.... ధ్రువమ్

27

ఉన్మద మదన మనోరథ పథిక వ -
ధూజన జనిత విలాపే,
అలికుల సంకుల కుసుమ సమూహ ని -
రాకుల వకుల కలాపే .... విహరతి.

24

శ్రీకుచాశ్లేష లగ్న కాశ్మీర ముద్రి
తమ్ము — వెల్గు వ్యక్తానురాగమ్ము రీతి,
శౌరి యుర మంగజశ్రమ వారి పూర
మెపుడు మీకుఁ బ్రియంబు పూరించుఁ గాత !

25

అంగజ జ్వర జాతార్తి నటవిఁ గుసుమ
మృదుతరావయవంబులు మిగుల నొవ్వ,
రమణు వెదకి వేసారిన రాధఁ గాంచి
సరసముగ జెలి పలుకు వసంత మందు.

అష్టపది 3

26

అందముగ వీచుఁ గోమల మందపవన
మధిక మంజు లవంగ లతాళిఁ దాకి,
మధుపకులముల కోకిలమండలముల
మధుర శబ్దాల పొదరిండ్లు మాఱుమోగెఁగు.

27

భావజాధీన కాతర స్వాంత లైన
పథికయువతీమణుల విలాపములు సాగు,
అలికులవ్యాప్త కుసుమచయాకుల మయి
లలిత వకుల కలాపముల్ లలన ! వెలుఁగు.

28

మృగమద సౌరభ రభస వశంవద
నవదళ మాల తమాలే,
యువజన హృదయ విదారణ మనసిజ
నఖరుచి కింశుక జాలే.... విహరతి.

29

మదనమహీపతి కనకదండ రుచి
కేసర కుసుమ వికాసే,
మిళిత శిలీముఖ పాటల పటల కృ –
తస్మర తూణ విలాసే.... విహరతి.

30

విగళిత లజ్జిత జగ దవలోకన
తరుణ కరుణ కృత హాసే,
విరహి నికృంతన కుంత ముఖాకృతి
కేతక దంతురితాశే....... విహరతి.

31

మాధవికాపరిమళలలితే నవ
మాలతి జాతి సుగంధౌ
ముని మనసా మపి మోహనకారిణి
తరుణాకారణబంధౌ........ విహరతి.

28

మధూర కస్తూరికా పరిమళము జల్లు
చిగురుటాకులఁ గానుగుచెట్లు వెలయుఁ,
దన్వి! యువజన హృదయ విదళన సక్త
కామనఖ కాంతి వలె కింశుకములు జెలఁగు.

29

అంగజాధిప కనక దండాతపత్ర -
ముల విధంబునఁ జాంపేయములు వెలుంగు,
భ్రమరములు జుట్టుకొన్నట్టి పాటలములు
మనసిజుని బాణముల పొదు లన జెలంగు.

30

సిగ్గు విడుచు వియోగుల చేష్ట లరసి
కరుణ వృక్షాలు వికసించు విరుల నవ్వ,
విరహులను జీల్చుటకు దాల్చు మరుని బల్లె
ములన దిక్కుల మొగలిపూవులు వెలుంగు

31

మాధవీపుష్ప గంధకోమలము నవ్య
మల్లికాసూన సౌరభమధురతరము
గాంత! మునిమానస విమోహకారణమ్మ
తరుణులకు నకారణము మిత్రమ్మ జూడ.

32

స్ఫుర దతిముక్తలతా పరిరంభణ
ముకుళిత పులకిత చూతే,
బృందావన విపినే పరిసరి పరి -
గత యమునా జలపూతే........ విహరతి.

[ శ్రీ జయదేవ భణిత మిద ముదయతి హరిచరణ స్మృతి సారమ్
సరస వసంత సమయ వనవర్ణన మనుగత మదన వికారమ్ ]

33

దర విదళిత మల్లీ వల్లి చంచత్పరాగ
ప్రకటిత పటవాసై ర్వాసయన్ కాననాని.
ఇహ హి దహతి చేతః కేతకీ గంధబంధుః
ప్రసర దసమబాణ ప్రాణవ ద్గంధవాహః.

34

ఉన్మీల న్మధుగంధ లుబ్ధ మధుప వ్యాధూత చూతాంకుర
క్రీడత్కోకిల కాకలీ కలరవై ర్దుదీర్ణ కర్ణజ్వరాః,
నీయంతే పథికైః కథం కథమపి ధ్యానావధానక్షణ
ప్రాప్త ప్రాణసమా సమాగమ రసోల్లాసై రమీ వాసరాః.

32

కౌఁగిలింపఁగ గురువిందదేతీగెలు ముకు
ళములఁ బులకించినట్టి చూతములు కలది,
ప్రాంత వరిగత యమునా ప్రవాహ సలిల
పావనం బైన యట్టి బృందావనమున.

(విహరతి – 26)

విరహ పీడితులకు దుఃఖకరము నైన
నీ వసంతాన జవరాండ్ర నెల్లఁ గూడి
నలిననాభుఁడు సంతస మొలుకుచుండ
నింతి ! విహరించు నర్తించు నింపుమీఱ.

33

మల్లియపూల పుప్పొడి దుమారము మానక నాల్గు మూలలన్
జల్లుచుఁ గేతకీ కుసుమసౌరభ మెల్లెడ నింపుచున్ మనం
బుల్లసిలన్ వసంతమున నుగ్మలి! కాముని జీవనం బనన్
జల్లఁగ గంధవాహములు సాగు వియోగుల గుండెఁ జీల్చుచున్.

34

లలనా! తేఁటులు మూగఁ బుష్పరస లోల స్వాంతమై మావిమొ
గ్గలఁ గ్రీడించెడి కోయిలల్ గలరుతుల్ గావింప నెంతేని, వీ
నులు దిమ్మెక్కఁగ నీ వసంతమునఁ బాంథుల్ బాధతో మానసం
బలయన్ ద్రోయుదు రీ దినంబులఁ బ్రియాధ్యానాతిహర్షంబునన్.

35

అనేక నారీ పరిరంభ సంభ్రమ
స్ఫురన్మనోహారి విలాస లాలసమ్.
మురారి మారా దుపదర్శయంత్యసౌ
సఖీ సమక్షం పునరాహ రాధికామ్.

అ ష్ట ప దీ. 4

36

చందన చర్చిత నీల కళేబర
పీతవసన వనమాలీ.
కేళిచల న్మణికుండల మండిత
గండయుగ స్మితశాలీ.
హరిరిహ ముగ్ధవధూనికరే వి
లాసిని! విలసతి కేళిపరే.........ధ్రువమ్.

37

పీన పయోధర భార భరేణ హ –
రిం పరిరభ్య సరాగమ్.
గోపవధూ రనుగాయతి కాచి దు –
దంచిత పంచమ రాగమ్....... హరిరిహ.

38

కాపి విలాస విలోల విలోచన
ఖేలన జనిత మనోజమ్.
ధ్యాయతి ముగ్ధవధూ రధికం మధు
సూదన వదనసరోజమ్.........హరిరిహ

35

వనితా జనతా సంగమ
జనితాదర రస విలాస చపలు సమీప
స్థుని గృష్ణుఁ జూపి రాధకుఁ
గనుమా! యని చెలియ బలుకుఁ గర మనురక్తిన్.

అ ష్ట ప ది. 4

36

చందనాంకిత దేహంబు నందు వెలయ
మగువ! పీతాంబరము, వనమాల,— కేళి
చలిత మణి కుండల ద్వయమ్మెలమి మంద
హాసకిరణాలు చెక్కిలు లందు నింప
హరియిచట ముగ్ధగోపీ నికరమునందు
నో విలాసిని! విహరించుచున్నవాఁడు.

37

రాగ పరవశయై యొక్క రమణి హరిని
లీల నిండైన వలుద పాలిండ్ల చేతఁ
గౌఁగిలించి యుచ్చై స్స్వరగతిని యాల
పించుఁ బంచమ రాగంబు ప్రేమ మీఱ.

38

నవ విలాస విలోల సుందరము లైన
నేత్రముల స్మరకోటి జనింపఁ జేయు
కమలనాభుని వదన పద్మమును ముగ్ధ
వధు వొకర్తుక ధ్యానించు భక్తి మీఱ.

39

కాపి కపోలతలే మిళితా లపి–
తుం కిమపి శ్రుతిమూలే.
చారు చుచుంబ నితంబవతీ దయి–
తం పులకై రనుకూలే........హరిరిహ

40

కేళి కళా కుతుకేన చ కాచి ద–
ముం యమునా జలకూలే,
మంజుల వంజుల కుంజ గతం విచ–
కర్ష కరేణ దుకూలే........హరిరిహ

41

కరతల తాళ తరళ వలయావళి
కలిత కలస్వన వంశే.
రాస రసే సహ నృత్యపరా హరి–
ణా యువతిః ప్రశశంసే........హరిరిహ

42

శ్లిష్యతి కామపి చుంబతి కామపి
కామపి రమయతి రామామ్,
పశ్యతి సస్మితచారుతరా మప–
రా మనుగచ్ఛతి వామామ్ ........హరిరిహ

[ శ్రీ జయదేవ భణిత మిద మద్భుత కేశవకేళి రహస్యం
బృందావన విపినే లలితం వితనోతు శుభాని యశస్యమ్. హరిరిహ ]

39

చెవుల నేదో రహస్యంబు జెప్పు రీతిఁ
జేరి చెంతకు నొక్క యంభోరుహాక్షి
పులకితంబయి మోహంబు జిలుకు నట్టి
ప్రియుని జెక్కిలిఁ బ్రీతిఁ జుంబించె నంత.

40

అతివ! యమునానదీతీర మందు మధుర
మంజుకుంజగృహంబున మసలు హరిని
లాగెఁ గరమునఁ జేలాంచలమ్ముఁ బట్టి
రతి కుతూహలయై మదవతి యొకర్తు.

41

లలిత రమ్యంబులైన జేతులను గలిపి
తాళములు వేయఁ గంకణధ్వనులు మురళి
ననుగమింప రాసక్రీడ యందుఁ బొగడెఁ
దన్ను గూడి నర్తించు గాంతను మురారి.

42

ఒక్క దానిని ముద్దిడు—నొక్కదాని
గౌఁగిలించును—మఱియొక గాంతఁ జూచు
నొక్కదాని రమించు—వేఱొక్కకోప
పరవశను బ్రేమ ననునయింపంగఁ బూను.

43

విశ్లేషా మనురంజనేన జనయ న్నానంద మిందీవర
శ్రేణీ శ్యామల కోమలై రుపనయ న్నంగై రనంగోత్సవమ్.
స్వచ్ఛందం వ్రజసుందరీభి రభితః ప్రత్యంగ మాలింగితః
శృంగార స్సఖి! మూర్తిమానివ మధౌ ముగ్ధో హరిః క్రీడతి.

44

నిత్యోత్సంగ వసద్భుజంగ కబల క్లేశాదివేశాచలం
ప్రాలేయ ప్లవనేచ్ఛయానుసరతి శ్రీఖండశైలానిలః
కిం చ స్నిగ్ధరసాల మౌళి ముకుళాన్యాలోక్య హర్షోదయా
దున్మీలంతి కుహూః కుహూ రితి కలోత్తాలాః పికానాం గిరః.

4?

రాసోల్లాస భరేణ విభ్రమ భృతా మాభీర వామభ్రువా
మభ్యర్ణం పరిరభ్య నిర్భర మురః ప్రేమాంధయా రాధయా
సాధు త్వద్వదనం సుధామయ మితి వ్యాహృత్య గీతస్తుతి
వ్యాజా దుత్కట చుంబితస్మిత మనోహారీ హరిః పాతు వః

ఇతి శ్రీజయదేవకవికృతౌ గీతగోవిందకావ్యే
సామోదదామోదరో నామ
ప్రథమస్సర్గః

43

ఆనందం బొనఁగూడ నందఱకుఁ జానా! లాలితేందీవర
శ్రేణీశ్యామల కోమలాంగములచే శృంగారముం జిందుచున్
సానందవ్రజ భామినుల్ దనను బ్రత్యంగంబుఁ జుట్టన్ వసం
తానన్ మన్మథమన్మథుండు హరి మోదం బారఁగ్రీడించెడిన్

44

మలయసమీరముల్ గనుము మానిని! కాపుర మున్న పన్నగం
బులె తము గ్రమింగ, నా గరళమున్ వెడలింపఁగ మంచునీటితో
జలిమల కేగుచున్నవి, రసాలము నందున విచ్చియున్న మొ
గ్గలఁగని కోయిలల్వలుకుఁ గ్రమ వికస్వర పంచమ శ్రుతిన్

45

ఘనరాసక్రియ మున్గి హర్షమున నక్కాంతా జనం బుండఁగా
జనితప్రేమ వశాంధ రాధ ప్రియు వక్షం బెంతయుం జుట్టి "మో
హాన! నీ మోము సుధామయం" బనుచు గానామోదకార్యచ్ఛలం-
బున ముద్దుం గొనమోవి, నవ్వు హరి మిమ్ముం బ్రోచుతన్ నిత్యమున్

ఇది గీతగోవిందకావ్యము నందు
సామోదదామోదర మను
ప్రథమ సర్గము.

## — ద్వితీయః సర్గః —

## — అక్లేశకేశవః —

1

విహరతి వనే రాధా సాధారణప్రణయే హరా
విగళిత నిజోత్కర్షా దీర్ష్యావశేన గతాన్యతః
క్వచిదపి లతాకుంజే గుంజన్మధువ్రతమండలీ
ముఖర శిఖరే లీనా దీనా ప్యువాచ రహస్సఖీమ్,

అ ష్ట ప ది 5

2

సంచర దధర సుధా మధురధ్వని ముఖరిత మోహన వంశమ్,
చలిత దృగంచల చంచల మౌళి కపోల విలోల వతంసమ్,
రాసే హరి మిహ విహిత విలాసం
స్మరతి మనో మమ కృత పరిహాసమ్, ధ్రువమ్.

3

చంద్రక చారు మయూర శిఖండక
మండల వలయిత కేశం,
ప్రచుర పురందర ధనురనురంజిత
మేదుర ముదిర సువేశమ్.........రాసే.

4

గోపకదంబ నితంబవతీ ముఖ
చుంబన లంభిత లోభం.
బంధుజీవ మధురాధర పల్లవ
కలిత దర స్మిత శోభమ్.........రాసే.

## — ద్వితీయ సర్గము —

### — అక్లేశ కేశవము —

1

శౌరి విహరింప గోపికా సహితుఁ డగుచు
స్వాతిశయము గతింప నీర్ష్యను వహించి
యలి రవంబుల మ్రోగు కుంజాంతరమునఁ
జెలియఁ గనుఁగొని దీనయై పలుకు రాధ.

2

మంజు లాధర మృదు సుధా మధుర కలిత
శబ్దముఖర మనోజ్ఞ వంశమ్ము వాని.
చంచల దృగంచములు. విచలిత మౌళి,
గండలోల వతంసంబు, గలుగు వాని,

3

చంద్రక మనోజ్ఞ శిఖిపింఛ చయ వలయిత
చారు కోమల కేశపాశమ్ము వాని,
ప్రచుర దేవేంద్ర ధను రనురంజితమ్ము
స్నిగ్ధమేఘమ్ము రీతిఁ గన్పించువాని.

4

పల్లవీజన వదః చుంబనము నందు
నిరవధికలోలహృదయుఁడై బఱంగు వాని,
బంధుజీవారుణాధరపల్లవమున
సరసముగఁ జిందు మందహాసమ్ము వాని

5

జలదపటల చలదిందు వినిందక
చందన బిందు లలాటం,
పీనపయోధర పరిసర మర్దన
నిర్దయ హృదయ కవాటమ్........రాసే

6

విపుల పులక భుజపల్లవ వలయిత
వల్లవ యువతి సహస్రం,
కరచరణోరసి మణిగణ భూషణ
కిరణ విభిన్న తమిస్రమ్........రాసే,

7

మణిమయ మకర మనోహర కుండల
మండిత గండ ముదారం,
పీతవసన మనుగత మునిమనుజ సు–
రాసుర వర పరివారమ్........రాసే.

8

విశద కదంబతలే మిళితం కలి
కలుషభయం శమయంతం,
మామపి కిమపి తరంగ దనంగ దృ–
శా మనసా రమయంతమ్........రాసే,

[ శ్రీ జయదేవ భణిత మతిసుందర మోహన మధురిపు రూపం,
హరి చరణస్మరణం ప్రతి సంప్రతి పుణ్యవతా మనురూపమ్. ]

5

అంబుదాళిఁ జలించు నబ్జారి మించు
గంధ బిందువు నుదుటను గలుగువాని.
పొంకముగ నున్న కుచముల బింక మణఁచు
కరుణ వీడిన విపులవక్షంబు వాని.

6

లలన! పులకిత భుజ కిసలయపరీత
వల్లవీ సహస్రముల రంజిల్లు వాని.
నంగముల నున్న మణిభూషణాళికిరణ
తతుల గాఢాంధకారంబుఁ దఱుము వాని.

7

మణిమకర కుండలద్వయంబునఁ జెలంగు
జెక్కుటలుల వాని— సంతత సేవ్యమాన
నరసురాసుర వర మునీశ్వరుని— హరిని
రమణి! రమణీయ పీతాంబరమ్ము వాని.

8

లలిత విశద కదంబ మూలమున దాగి
నట్టివానిఁ గలికలుష మణఁచువాని,
మదన రాగ తరంగ సంభరిత దృష్టిఁ
జిత్తమున నను రమియింపఁ జేయు వాని.

( రాసే హరిమిహ. 2 )
రాస లీలా వినోద విలాస పరుని.
మించి నా మది తలఁచు హసించు హరిని.

9

గణయతి గుణగ్రామం భ్రామం భ్రమాదపి నేహతే
వహతి చ పరితోషం దోషం విముంచతి దూరతః
యువతిషు వలత్తృష్ణే కృష్ణే విహారిణి మాం వినా
పునరపి మనోవామం కామం కరోతి కరోమి కిమ్?

అ ష్ట ప దీ, 6

10

విభృత నికుంజ గృహంగతయా నిశి
రహసి నిలీయ వసంతం.
చకిత విలోకిత సకలదిశా రతి
రభస భరేణ హసంతమ్.
సఖి! హే కేశిమథనముదారం రమయ మయాసహ
మదన మనోరథ భావితయాసవికారమ్....... ధ్రువమ్.

11

ప్రథమ సమాగమ లజ్జితయా పటు
చాటుశతై రనుకూలం,
మృదు మధుర స్మిత భాషితయా శిథి—
లీ కృత జఘనదుకూలమ్.........సఖి!

12

కిసలయ శయన నివేశితయా చిర
మురసి మమైవ శయానం.
కృత పరిరంభణ చుంబనయా పరి—
రభ్య కృతాధరపానమ్.........సఖి!

9

నను విడనాడి గోపలలనా మధురాధర సక్తుఁ డైన వా
నిని దలపోయు, నెంతయు గణించును వాని గుణాళి. సంతసం
బును వహియించు,ఁ గోపమును బొందదు, దోషములందృజించు. నా
మన మిది వక్రగామి యయి మాధవుఁగోరు నికేమిజేయుదున్?

అ ష్ట ప ది. 6

10

ఒంటిగా రేయి పూఁబొదరింట భీతి
నలువలంకులు జూచుచుండంగ నేను
ముందె యందున్న గోవిందమూర్తి యంత
సరస రతి భావమున నవ్వసాగినాడు.

11

ప్రథమ సంగమమున సిగ్గుపడఁగ వలపు
దెలియఁ బ్రియవాక్యముల నెన్నొ పలికినాడు,
మధుర దరహాసమున నేను మాటలాడ
వింత! జఘన వస్త్రముఁ దొలఁగించినాడు.

12

తలిరుటాకుల పాన్పున దనరు నాదు
నెడఁద గృష్ణుఁడు చిరము శయించినాడు,
చుంబన మొసఁగ్గ. నాలింగనంబు జేసి
తాను నా మోవిపానక మానినాడు.

13

అలస నిమీలిత లోచనయా పుల
కావలి లలిత కపోలం
శ్రమజల సకల కళేబరయా వర
మదన మదా దతిలోలమ్.........సఖి!

14

కోకిల కలరవ కూజితయా జిత
మనసిజ తంత్ర విచారం,
శ్లథ కుసుమాకుల కుంతలయా నఖ
లిఖిత ఘనస్తన భారమ్.........సఖి.

15

చరణ రణిత మణినూపురయా పరి–
పూరిత సురత వితానం,
ముఖర విశృంఖల మేఖలయా సక–
చగ్రహ చుంబనదానమ్.........సఖి

16

రతిసుఖ సమయ రసాలసయా దర
ముకుళిత నయన సరోజం,
నిస్సహ నిపతిత తనులతయా మధు
సూదన ముదిత మనోజమ్.........సఖి!

13

ముదముచే నాకు గన్నులు మూఁతవడెను
పులకరించెను జెక్కిలి చెలి! ప్రియునకు.
నిండె నా మేన శ్రమ సంజనిత జలమ్ము
స్మర మదంబున దా మేను మఱచినాఁడు.

14

కోకిల కపోత సుమధుర కూజితములు
జేయ. రతిశాస్త్రచర్చఁ దా జేసినాడు.
పూలు ధమ్మిల్లమున నుండి రాలుచుండ
స్తనముల నఖక్షతంబుల నునిచినాఁడు.

15

కాంత! నా కాలియందెలు గల్లుమనగ
సురత బంధ ప్రభేదాలు నెఱపినాఁడు.
మ్రోఁగుచుండ నొకేవిధముగ రశనము
మించి కొప్పును బట్టి చుంబించినాఁడు.

16

అతివ! నే రతిసుఖసమయమున మిగుల
నలసి యుండఁగ దరమీలితాక్షుఁ డయ్యె.
పరవశత తనూలత నేను వ్రాల్చియుండ
నుదిత నూతన సుందర మదనుఁ డయ్యె.

[ శ్రీ జయదేవ భణిత మిదమతిశయ మధురిపు నిధువన శీలం,
సుఖ ముత్కంఠిత గోపవధూ కథితం వితనోతు సలీలమ్ ]

17

హస్త స్రస్త విలాసవంశ మనృజ భ్రూవల్లిమద్వల్లవీ
బృందోత్సారి దృగంతవీక్షిత మతి స్వేదార్ద్రి గండస్థలం.
మా ముద్వీక్ష్య విలజ్జితం స్మిత సుధా ముగ్ధాననం కాననే
గోవిందం వ్రజసుందరీ గణవృతం పశ్యామి హృష్యామి చ.

18

దురాలోక స్తోక స్తబక నవకాశోక లతికా
వికాసః కాసారోపవన పవనోఽపి వ్యథయతి,
అపి భ్రామ్య ద్భృంగీ రణిత రమణీయా న ముకుళ
ప్రసూతి, శ్చూతానాం సఖి! శిఖరిణీయం సుఖయతి.

19

సాకూతస్మిత మాకులాకుల గళద్ధమ్మిల్ల ముల్లాసిత
భ్రూవల్లీక మలీక దర్శిత భుజా మూలోర్ధ్వ హస్తస్తనం,
గోపీనాం నిభృతం నిరీక్ష్యగమితాకాంక్షశ్చిరం చింతయ
న్నంత ర్ముగ్ధ మనోహరం హరతు వః క్లేశం నవః కేశవః

ఇతి శ్రీ జయదేవ కవికృతౌ గీతగోవిందకావ్యే
అక్లేశకేశవో నామ
ద్వితీయ స్సర్గః

( సఖి! హే కేశి. 10 )

ఇట్టి రసికావతంసు లోకేశు కేశి
దానవాంతకు, గృష్ణు. సదయుని పొందు
స్మరమనోరథ భావ సమ్మథిత మైన
నాకు సమకూర్చి చెలియ! పుణ్యమున బొమ్ము.

17

కరముం బిల్లనఁ గ్రోవి జాఱెఁ— గనుసైగం జేసెగోపీజనో
త్కరముం జూచి—చెమర్చెఁ జెక్కిలియు—డెందంబందు లజ్జించెనో
తరుణీ! నన్గని—యట్టివాని స్మితముగ్ధ శ్రీముఖాంభోజు నా
హరినిం జూతు వ్రజాంగనా గణవృతున్, హర్షింతు నత్యంతమున్

18

సకియ! దురంతతాపమును సల్పు నశోక లతా వికాసమై
ప్రకట సరోవరోపవనవాయువు నన్గడు బాధ వెట్టు, వా
రక నునుఁదేనెఁ గ్రోలఁగఁ గరంబును దుమ్మెదలావరింప మో
హక మగు మావిమొగ్గ యకటా! మదికింపు ఘటింప దిత్తఱిన్

19

దరహాసంబులు—జారుగొప్పలును—నుద్యద్రమ్య భ్రూవల్లికల్—
సరసాలీక విశేష దర్శిత భుజాసమ్మూలముల్—వ్యక్తసుం
దరవక్షోజము—లైన గోపికల కృత్యంబుల్ రహస్యంబుగా
బరిశీలించి విలాసనవ్యుఁడగు గోపాలుండు మిమ్మేలుతన్.

ఇది గీతగోవిందకావ్యము నందు
అక్లేశకేశవ మను
ద్వితీయ సర్గము.

## —తృతీయః సర్గః—

## —ముగ్ధమధుసూదనః—

1

కంసారి రపి సంసార
వాసనా బద్ధ శృంఖలాం.
రాధా మాదాయ హృదయే
తత్యాజ వ్రజసుందరీః

2

ఇత స్తతస్తా మనుసృత్య రాధికా
మనంగ బాణవ్రిణ ఖిన్న మానసః
కృతానుతాప స్స కళింద నందినీ
తటాంతకుంజే విషసాద మాధవః

అ ష్ట ప ది. 7

3

మా మియం చలితా విలోక్యవృతం వధూ నిచయేన
సాపరాధతయా మయాపి న వారితాఽతి భయేన.
హరి హరి హతాదరతయా సా గతా కుపితేవ. ధ్రువమ్.

4

కిం కరిష్యతి కిం వదిష్యతి
సా చిరం విరహేణ.
కిం ధనేన జనేన కిం
మమ జీవితేన గృహేణ?.........హరిహరి-

## —తృతీయ సర్గము—

## —ముగ్ధమధుసూదనము—

1

భవ విషయ వాసనా పరంపరల నెపుడు
దన్ను బంధించు నిగళమై దనరు నట్టి
రాధ నెంతయుఁ గంసమర్దనుఁడు కూడ
నిలిపి మనసున వ్రజసుందరులను వీడె.

2

మాధవుం డచ్చటచ్చట మావినికయి
వెదకి పుష్పసాయకభిన్న హృదయుఁడు. విహి
తానుతాపుఁడునై చింతయందు మునిగె
యమున యొడ్డున లలితకుంజమున జేరి.

3

అంగనాజన పరివృతుఁడైన నన్ను
నరసి భామ హతాదర యగుచుఁ బోయె
కుపితయైనట్లు నేనడ్డుకొనఁగ నైతి
సాపరాధుఁడ నగుట భయంబు కతన.

4

చిర విరహభారమున నేమి జేయు నొక్కొ
యను-యించెడి వేళ నే మనునొ నన్ను?
యేల ధనము జనంబును గృహ మదేల?
జీవితం బేల జెలివి వీక్షింవకున్న.

5

చింతయామి తదాననం కుటి-
లభ్రు కోపభరేణ
శోణపద్మ మివోపరి భ్రమి-
తాకులం భ్రమరేణ........హరిహరి

6

తా మహం హృది సంగతా మని-
శం భృశం రమయామి,
కిం వనేఽనుసరామి తా మిహ
కిం వృథా విలపామి........హరిహరి

7

తన్వి ఖిన్న మసూయయా హృద-
యం తవాకలయామి,
త న్న వేద్మి కుతో గతాసి న-
తేన తేఽనునయామి........హరిహరి.

8

దృశ్యసే పురతో గతాగత
మేవ మే విదధాసి.
కిం పురేవ ససంభ్రమం పరి-
రంభణం న దదాసి........హరిహరి.

5

కోపమునఁ గుటిలభ్రుకుటి కొమరు మీఱు
సుదతి వదన బింబమ్ము నా మదిఁ దలంతు
గండుతుమ్మెద తిరుగాడుచుండ మీద
నదరుచుండెడి కెందామరంచు నేను

6

అనిశము మదీయ హృదయ మందున వసించు
నామెను రమింపఁ జేయుదు నతిశయముగ
వనము నందున వెదుక నేఫలము గలదు
వ్యర్థముగ విలపింపఁ గార్యంబు గలదె?

7

అతివ! భావింతు నీ హృదయంబు నేడు
నిండియున్న దసూయచే నిక్కువముగ
నెచట కేగితొ నీవు నేనెఱుఁగ? నిదె న-
మస్కృతుల నిన్ను నే బ్రతిమాలుచుంటి

8

నా యెదుట నుందు వీవు గన్పడుచు నెపుడు
కలికి! చేయుదు రాకపోకలను మాత్ర
మకట! మునుపటి రీతి సమక్ష మందె
సంభ్రమమునఁ గౌఁగిలిని యొనంగవేల?.

9

క్షమ్యతా మపరం కదాపి త—
వేదృశం న కరోమి
దేహి సుందరి! దర్శనం మమ
మన్మథేన దునోమి.........హరిహరి.

[ వర్ణితం జయదేవకేన హరే రిదం ప్రవణేన,
కిందుబిల్వ సముద్ర సంభవ రోహిణీ రమణేన. ]

10

హృది బిసలతా హారో నాయం భుజంగమ నాయకః
కువలయ దళశ్రేణీ కంఠే న సా గరళ ద్యుతిః,
మలయజరజో నేదం భస్మ ప్రియా రహితే మయి
ప్రహరసి హరభ్రాంత్యాఽనంగ! క్రుధా కిము ధావసి.

11

పాణౌ మా కురు చూతసాయక మముం మా చాప మారోపయ
క్రీడానిర్జితవిశ్వ! మూర్ఛిత జనాఘాతేన కిం పౌరుషం,
తస్యా ఏవ మృగీదృశో మనసిజ! ప్రేంఖ త్కటాక్షాశుగ
శ్రేణీ జర్జరితం మనాగపి మనో నాద్యాపి సంధుక్షతే.

12

భ్రూపల్లవం ధను రపాంగ తరంగితాని
బాణా గుణశ్రవణపాళి రితి స్మరేణ
తస్యా మనంగజయ జంగమ దేవతాయా
మస్త్రాణి నిర్జిత జగంతి కి మర్పితాని?

9

నన్ను క్షమియించు దేవి! యే నాటి కైన
నెట్టి తప్పును నే నాచరింప నింక
రమణి! నాకొక్కసారి దర్శనము నిమ్మ
పంచబాణుఁడు నన్ను దహించుచుండె.

10

తమ్ములతూఁడు దండయిది దర్పక! సర్పము గాదు జూడు వ
క్షమ్మునఁ— గల్వ పూవరుస కాంతియ గాని విషంబు గాదు కం
ఠమ్మునఁ— జందనం బిది ఘనంబుగ భస్మము గాదు దేహ మం
దిమ్మెయి, దాడిచేసెద వదేల వియోగిపయిన్ శివభ్రమన్?

11

మారుఁడ! బాణముం గొనకు మాపయి. మోపకు గార్ముకం బిటుల్
పౌరుషమౌనె మూర్ఛితుని బట్టి వధింపఁ గురంగలోచనా
సారకటాక్షబాణముల జర్జరితం బయి యున్న నా మనం
బారఁగ నేటికైన నిసుమంతయు స్వాస్థ్యము జెంద దక్కటా!

12

అరయ ధనుస్సు భ్రూకిసలయమ్ము—శరంబు లపాంగజాలముల్
పరఁగ గుణంబికన్ శ్రవణపాళి— జగంబుల గెల్చు నస్త్రముల్
స్మరుఁడిటు పంచబాణజయ జంగమదేవత యైన రాధికా
తరుణిఁ గరంబు భద్రముగ దాచినవాఁడని యెంతు నెంతయున్

13

భ్రూచాపే నిహితః కటాక్షవిశిఖో నిర్మాతు మర్మవ్యథాం
శ్యామాత్మా కుటిలః కరోతు కబరీభారోఽపి మారోద్యమం.
మోహం తావ దయం చ తన్వి! తనుతాం బింబాధరో రాగవాన్
సద్వృత్త స్తనమండల స్తవ కథం ప్రాణై ర్మమ క్రీడతి.

14

తాని స్పర్శసుఖాని తే చ సరళాః స్నిగ్ధాః దృశో ర్విభ్రమాః
తద్వక్త్రాంబుజసౌరభం స చ సుధాస్యందీ గిరాం వక్రిమా,
సా బింబాధర మాధురీతి విషయాసంగేఽపి చే న్మానసం
తస్యాం లగ్నసమాధి హంత! విరహ వ్యాధిః కథం వర్ధతే,?

15

తిర్యక్కంఠ విలోల మౌళి తరళోత్తంసస్య వంశోచ్చర
ద్దీప్తిస్థాన కృతావధాన లలనాల క్షై ర్న సంలక్షితాః,
సమ్ముగ్ధే మధుసూదనస్య మధురే రాధాముఖేందౌ సుధా
సారే కందళితా శ్చిరం దదతు వః క్షేమం కటాక్షోర్మయః

ఇతి శ్రీజయదేవకవికృతౌ గీతగోవిందకావ్యే
ముగ్ధమధుసూదనో నామ
తృతీయ స్సర్గః

13

నను బాధించుత భ్రూశరాసనమునన్ సంసిద్ధమై వాలుచూ
పను బాణంబు. వధించుగాత కుటిల శ్యామంబు నీవేణియున్,
గన బింబాధర మింక రాగయుతమై గల్పించుతన్ మూర్ఛ, నై
నను సద్వృత్తయుతస్తనంబు లెటు కాంతా! తీయుఁ బ్రాణమ్ములన్?

14

అవియే స్పర్శసుఖంబు—లా కనుల రమ్యంబౌ విలాసంబులున్
యవియే—వక్త్రపయోజసౌరభ మదే—యా వక్ర మౌపల్కులున్
యవె-బింబాధర మాధురీగుణ మదే—యంచున్ మనంబా మెతో
నవిభిన్నంబు సమాధిచే, విరహ మేలా! వృద్ధియౌ నీగతిన్,?

15

తలఁ ద్రిప్పంగఁ గిరీటముం గదల నుత్తంసంబు జాఱంగ, వం
శలసత్స్థానకృతావధానలలనా సందోహముల్ ధ్యానచి
త్తలునై జూడకయుండ. మోహనము రాధాపూర్ణచంద్రాస్యమున్
గలయం జూచు రమాధినాధుని కటాక్షంబుల్ మిముంబ్రోచుతన్,

ఇది గీతగోవిందకావ్యమందు
ముగ్ధమధుసూధన మగు
తృతీయ సర్గము

— చతుర్థః సర్గః —

- స్నిగ్ధమధుసూదనః —

1

యమునా తీర వానీర
నికుంజే కుంజ మాస్థితం,
ప్రాహ ప్రేమోద్భరోద్భ్రాంతం
మాధవం రాధికాసఖీ

అ ష్ట ప దీ. 8

2, 3

నిందతి చందన మిందు కిరణ మను
విందతి ఖేద మధీరం
వ్యాళ నిలయ మిళనేన గరళ మివ
కలయతి మలయ సమీరమ్
మాధవ! మనసిజ విశిఖభయాదివ
భావనయా త్వయి లీనా
సా విరహే తవ దీనా.........ధ్రువమ్,

4

అవిరళ నిపతిత మదనశరా దివ
భవ దవనాయ విశాలం,
స్వహృదయ మర్మణి వర్మకరోతి స—
జల నళినీ దళ జాలమ్.........సావిరహే.

## — చతుర్థ సర్గము —

### — స్నిగ్ధమధుసూదనము —

1

యమునాతట వంజుల కుం
జమున నిరుత్సాహుఁ డగుచు సంస్థితుఁడై ని
త్యము ప్రేమ సంచలుండగు
కమలాక్షుని జూచి రాధికా సఖి పల్కెన్.

2

చందనంబును నిందించు, నిందు కిరణ
ముల కధీరతఁ గడు దుఃఖమును వహించు,
వ్యాళనిలయ మేళనమున వచ్చు మలయ
పవనమును గరళంబుగా వనిత దలఁచు.

3

మనసిజ విశిఖాళి భయం
బును జెందిన యట్లు ధ్యానమున నీలో దా
గెను రాధ నీ వియోగం
బును సైపగలేదు దైన్యమున గోవిందా !

4

స్మర వినిర్ముక్త శరపరంపరల నుండి
యెంతయును నిన్ను గాపాడ నెంచి దాల్చెఁ
గాంత హృదయ మర్మంబున గవచ మట్లు
సజల జలజాత పత్రసంచయముఁ గృష్ణ !

5

కుసుమ విశిఖ శరతల్ప మనల్ప వి –
లాసకళా కమనీయం
వ్రత మివ తవ పరిరంభ సుఖాయ క –
రోతి కుసుమ శయనీయమ్........ సావిరహే.

6

వహతి చ చలిత విలోచన జలధర
మానన కమల ముదారం
విధు మివ వికట విధుంతుద దంత ద -
ళన గళితామృత ధారమ్ - సావిరహే.

7

విలిఖతి రహసి కురంగ మదేన భ –
వంత మసమశర భూతం.
ప్రణమతి మకర మధో వినిధాయ క –
రే చ శరం నవచూతమ్, సావిరహే.

8

ధ్యానలయేన పురః పరికల్ప్య భ –
వంత మతీవ దురాపం
విలపతి హసతి విషీదతి రోదితి
చంచతి ముంచతి తాపమ్, సావిరహే.

5

అతివ మన్మధ శరతల్ప మైన వ్రతము
వలె త్వదాలింగన సుఖ సంప్రాప్తి నెంచి
లలిత సవిలాస సకల కళా మనోహ
రంబు విరిపాన్పు నతి మధురముగఁ దీర్చు.

6

చలిత లోచన జలధర కలిత వదన
నీరజ ముదారము వహించుఁ గ్రూర రాహు
దంత విదళన గళిత సుధా ప్రవాహ
చంద్ర బింబమ్ము రీతిని సరసిజాక్ష !

7

రమణి కస్తూరిచే నేకతమున మదన
మూర్తివై యున్న నీ రూపమును లిఖించు
మకరమును గ్రిందఁ, జూతసాయకము హస్త,
మందు జిత్రించి జేయును వందనమ్ము.

8

సంతతము భవచ్చింతనాసక్త యగుచు
నెదుట దుర్లభు నిన్ను భావించి దేవ!
యేమియో మాటలాడుఁ — దానేడ్చు — నవ్వు —
సంచలించుఁ — దపించు — ఖేదించు — మిగుల.

9

ప్రతిపద మిదమపి నిగదతి మాధవ !
తవ చరణే పతితాహం,
త్వయి విముఖే మయి సపది సుధానిధి
రపి తనుతే తనుదాహమ్.........సావిరహే,

[శ్రీ జయదేవ భణిత మిద మధికం యది మనసా నటనీయం
హరివిరహాకులవల్లవయువతిసఖీవచనం పఠనీయం.]

10

ఆవాసో విపినాయతే ప్రియసఖీ మాలాపి జాలాయతే
తాపోఽపి శ్వసితేన దావ దహన జ్వాలా కలాపాయతే,
సాపి త్వద్విరహేన హంత ! హరిణీ రూపాయతే హా కథం
కందర్పోఽపి యమాయతే విరచయన్ శార్దూల విక్రీడితమ్.

అ ష్ట ప ది. 9

11

స్తన వినిహిత మపి హార ముదారం
సా మనుతే కృశతను రివ భారం
రాధికా తవ విరహే కేశవ !........ ధ్రువమ్.
సరస మసృణమపి మలయజ పంకం
పశ్యతి విషమివ వపుషి సశంకమ్........ రాధికా.

12

శ్వసితపవన మనుపమ పరిణాహం
మదన దహన మివ వహతి సదాహమ్........ రాధికా.
దిశి దిశి కిరతి సజల కణజాలం
నయన నళిన మివ విగళిత నాళమ్........ రాధికా.

9

వనిత ప్రతిపదమున నిట్టు లను "ముకుంద!
చరణ దాసిని నను జూడు కరుణతోడ
నకట! నాయెడ విముఖుండ వైన కతన
నిదె సుధానిధి తనువు దహించుచుండె".

10

రమణికి ధర్మ్య హర్మ్యము లరణ్యము లాయె – నిఁకన్ సఖీకదం
బము వలయయ్యెఁ – బ్రజ్వలిత పావక దారుణమాయె దేహతా
పమును – భవద్వియోగమునఁ బద్మదళాక్షియు లేడి యాయెఁ – బా
పము యముఁడాయె మన్మథుఁడు వ్యాఘ్రవిహార విశంకటక్రియన్.

అష్టపది – 9

11

స్తనయుగ నిహిత నిర్మల తార హార
ములఁ గృశాంగి భారంబుగఁ దలఁచు, దేహ
మందు స్నిగ్ధకోమల మైన చందనమును
గాంత శంకించు గరళంబుగా మురారి !.

12

శ్వసిత పవనంబు, ననుపమ పరిణతంబు,
మన్మథాగ్ని విధంబున మగువ దాల్చుఁ,
కాడ లూడిన పద్మాల కరణి నున్న
సాశ్రునేత్రాల నల్దిక్కు లరయుచుండు,

13

త్యజతి న పాణితలేన కపోలం
బాల శశిన మిన సాయ మలోలం.........రాధికా.
నయన విషయ మపి కిసలయ తల్పం
కలయతి విహిత హుతాశన కల్పమ్......... రాధికా,

14

హరి రితి హరి రితి
జపతి సకామం
విరహ విహిత మర –
ణేన నికామమ్......... రాధికా.

[ శ్రీ జయదేవ భణితమితిగీతం
సుఖయతు కేశవపద ముపనీతమ్......... ]

15

సా రోమాంచతి సీత్కరోతి విలపత్యుత్కంపతే తామ్యతి
ధ్యాయ త్యుద్భ్రమతి ప్రమీలతి పత త్యుద్యాతి మూర్ఛత్యపి,
ఏతావత్యతనుజ్వరే వరతను ర్జీవే న్న కిం తే రసాత్
స్వర్వైద్య ప్రతిమః ప్రసీదసి యది త్యక్తోఽన్యథా హంతకః.

16

స్మరాతురాం దైవత వైద్య హృద్య !
త్వ దంగసంగామృత మాత్ర సాధ్యాం,
నివృత్తబాధాం కురుషే న రాధాం
ఉపేంద్ర ! వజ్రాదపి దారుణోఽసి.

13

వనిత సంజవేళల నెలవంకఁబోలు
జెక్కు లరఁజేయిఁ జేర్చి యోచించుచుండుఁ,
మృదుల కిసలయ తల్పంబు నెదుటఁ గాంచి
యగ్నికల్పంబుగా నెంచు ! నంబుజాక్షి!.

14

ప్రబల దుస్సహ విరహ తాపంబు చేత
మరణదశ పొందినది వోలెఁ దరుణి సతము
హరిహరి యటంచు జపియించు నతిశయముగ
సాభిలాష హృదంబుజ యగుచు మిగుల.

15

పులకించున్-విలపించు-సీత్కృతులు సల్పున్ - గంపముంజెందు - మూ
ర్ఛిలు - ధ్యానించు - భ్రమించు - మూయుఁ గనులన్ – జింతించు -
లేచుం - బడున్.
జెలి గాపాడుము స్వర్గవైద్య సమ! త్వ చ్ఛృంగార బంధమ్మునన్
గలఁడే యంతకుఁ డట్లు గానియెడ నీ కంబెన్ ధరం గేశవా !

16

అరయ దైవతవైద్యహృద్య! భవ దంగ
సంగమామృత కేవల సాధ్య యైన
జెలిని నిర్ముక్త బాధను జేయవేనిఁ
గఠినుఁడ వుపేంద్ర! వజ్రము కంటె నీవు.

17

కందర్పజ్వర సంజ్వరాతురతనో రాశ్చర్య మస్యా శ్చిరం
చేత శ్చందన చంద్రమః కమలినీ చింతాసు సంతామ్యతి,
కింతు క్లాంతి వశేన శీతలతనుం త్వా మేక మేవ ప్రియం
ధ్యాయంతీ రహసి స్థితా కథమపి క్షీణా క్షణం ప్రాణితి.

18

క్షణమపి విరహః పురా న సేహే
నయన నిమీలన ఖిన్నయా యయా తే,
శ్వసితి కథ మసౌ రసాల శాఖాం
చిరవిరహేన విలోక్య పుష్పితాగ్రామ్.

19

వృష్టివ్యాకుల గోకులావన రసా దుద్ధృత్య గోవర్ధనం
బిభ్ర ద్వల్లవ వల్లభాభి రధికానందా చ్చిరం చుంబితః
దర్పేణేవ తదర్పితాధర తటీ సిందూర ముద్రాంకితో
బాహు ర్గోపతనో స్తనోతు భవతాం శ్రేయాంసి కంసద్విషః.

ఇతి శ్రీ జయదేవ కవికృతౌ గీత గోవిందకావ్యే
స్నిగ్ధ మధుసూదనో నామ
చతుర్థస్సర్గః

17

మనసిజ తాప తప్తయయి మానిని డస్సియుఁ జందమామఁ, జం
దనమును, దామరాకుఁ, బగదాయగ నెంచును గాని నిన్ను జ
ల్లని హృదయుం బ్రియున్ మదిఁ దలంచుచు నేకతమందు నిత్యమున్
వనిత గృశించి యెంతయు క్షణంబెటులో ధరియించుఁ బ్రాణముల్.

18

మునుపు వియోగ మొక్క క్షణమున్ సహియింపని దింక. నేత్రిమీ
ళనమున గూడ మిక్కిలి కలంగెడి యీ లలితాంగి నేడు పూ
చిన నునుఁదీయ మామిడిని జేరి కనుంగొనుచున్ భవచ్చిరం
తన విరహంబుచే నెటుల దామరసాక్షి ధరించుఁ బ్రాణముల్. ?

19

ఏది నగంబు లీలఁగ ధరించెనొ గోకుల రక్షణార్థమై
మోదముతోడ గోపికలు ముద్దిడిరో నిరతంబు దేనినిన్
యేదియొ వారి మోవిఁగడు నింపగు గుంకుమఁ బూసి కొన్నదో
యా దనుజారి బాహువు శుభావళిఁ గూర్చుత మీకు నెప్పుడున్.

ఇది గీతగోవింద కావ్యమందు
స్నిగ్ధమధుసూదన మను
చతుర్థసర్గము.

## — పంచమః సర్గః —

## — సాకాంక్ష పుండరీకాక్షః —

1

అహ మిహ నివసామి యాహి రాధా
మనునయ మద్వచనేన చానయేథాః
ఇతి మధురిపుణా సఖీ నియుక్తా
స్వయ మిద మేత్య పున ర్జగాద రాధామ్,

అ ష్ట ప దీ. 10

2

వహతి మలయసమీరే మదన ముపనిధాయ
స్ఫుటతి కుసుమనికరే విరహి హృదయ దళనాయ
తవ విరహే వనమాలీ
సఖి ! సీదతి రాధే! ........ ధ్రువమ్.

3

దహతి శిశిర మయూఖే
మరణ మనుకరోతి,
పతతి మదన విశిఖే
విలపతి వికలతరోఽ తి........ తవ....

4

ధ్వనతి మధుప సమూహే
శ్రవణ మపిదధాతి,
మనసి కలతి విరహే
నిశి నిశి రుజ ముపయాతి........ తవ ....

## — పంచమ సర్గము —

### — సాకాంక్ష పుండరీకాక్షము —

1

ఇచట నేనుండు పోయి వచింపు నాదు
మాటలుగ నామె కోపంబు మాన్పు మీవు
వెంటఁ గొనిరమ్మటంచు గోవిందుఁ డంప
వచ్చి చెలికత్తె రాధతో బలుకు నిట్లు.

అష్టపది 10

2

మలయానిలుండు మదనుని
జెలికాఁడటు వీవ గుండె జెదరంగ వియో
గులకు, వికసింపఁ గుసుమం
బుల, జెలి! వనమాలి విరహమున వెతఁ జెందున్.

3

శీతల కిరణుం డేచఁగఁ
గాతరుఁడై మరణమే సుఖంబని దలఁచున్
చేతోజాతుఁడు విశిఖా
ఘాతంబుల నొంపగా వికలుఁడై యేడ్చున్.

14

తుమ్మెద లొక్కుమ్మడి జుం
జుమ్మని మ్రోయంగ నులుకుచును మూయును గ
ర్ణమ్ములు, వ్యధఁ జెందును విర
హమ్మున బ్రతిరాత్రియున్ రుజార్తిం బొందున్.

5

వసతి విపిన వితానే
త్యజతి లలిత ధామ
లుఠతి ధరణి శయనే
బహు విలపతి తవ నామ ........ తవ.

6

రణతి పిక సమవాయే
ప్రతిదిన మనుయాతి,
హసతి మనుజ నిచయే
విరహ మపలపతి నేతి........ తవ.

7

స్ఫురతి కలరవ రావే
స్మరతి మణిత మేవ
తవరతి సుఖవిభవే
గుణయతి సుగుణ మతీవ........ తవ.

8

త్వదభిధ శుభధ మాసం
వదతి నరి శృణోతి
తమపి జపతి సరసం
యువతిషు న రతి ముపైతి........ తవ.

[ భణతి కవిజయదేవే విరహవిలసితేన
మనసి రభస విభవే హరి రుదయతు సుకృతేన. ]

5

తిరుగును విపిన తలంబుల
విరసం బని లలిత గృహము విడిచెఁ గరంబున్
పొరలు మహీ తల్పంబునఁ
దరుణీ! నీ నామమే సదా జపియించున్.

6

కోకిల గుంపులు గూయఁగ
వ్యాకులుఁడై యిటుల నటుల బరుగెత్తుఁ, బ్రజా
నీక 'మిదేమ'ని నవ్వఁగ
వాకొను 'లేదేమి' యంచు బాధను దాఁచున్.

7

పారావత కలరవ మిం
పారగ విని తలఁచు మది రసానందుండై
నీ రతి కూజితములనే
గౌరవమున నీదు సుగుణ గణము నుతించున్.

8

విను 'రాధమాస' మని యెవఁ
డనినన్ రాగాన మిగుల ధ్యాన మొనర్చున్
మనమున! దానినె ప్రీతిం
గనఁ డే మాత్రింబు నితర కాంతల యెడలన్

9

పూర్వం యత్ర సమం త్వయా రతిపతే రాసాదితా స్సిద్ధయః
తస్మి న్నేవ నికుంజ మన్మథ మహాకుంజే పున ర్మాధవః.
ధ్యాయం స్త్వా మనిశం జపన్నపి తవై వాలాప మంత్రావళీం
భూయ స్త్వత్కుచకుంభ నిర్భర పరీరంభామృతం వాంఛతి.

అష్టపది — 11

10, 11

రతిసుఖసారే గతమభిసారే
మదనమనోహరవేషం,
న కురు నితంబిని ! గమనవిలంబన
మనుసర తం హృదయేశమ్,
ధీరసమీరే యమునాతీరే
వసతి వనే వనమాలీ.
గోపీ పీనపయోధరమర్దన
చంచలకర యుగశాలీ........ ధ్రువమ్.

1?

నామ సమేతం కృత సంకేతం
వాదయతే మృదు వేణుమ్.
బహు మనుతే నను తే తనుసంగత
పవన చలిత మపి రేణుమ్........ ధీరసమీరే.

9

మును నీతోడ సమంబుగా నెచటఁ దాఁ బొందెన్ మహాకామసి
ద్ధిని దన్మంజు నికుంజ మన్మథ మహా తీర్థంబునన్ మాధవుం
డనిశంబున్ జపియించుచు న్మది త్వదీయాలాప మంత్రావళిన్
వనితా! కోరు భవ త్సమృద్ధ కుచకుంభ ద్వంద్వ సంశ్లేషమున్.

అ ష్ట ప ది 11

10

సరస రతిసౌఖ్య సార దేశమున నతివ!
ప్రసవ సాయక సుకుమార రమ్యమూర్తి
కృష్ణుఁడెంతేని దా నిరీక్షించుచుండె
ననుసరింపు గమనవిలంబన మిఁకేల.?

11

రమణి! మలయమారుతము మందముగ వీచు
యమున యొద్దున పొదరింటియందు నుండె
వల్లవీ పీన కుచయుగ ప్రాంత సీమఁ
జలిత కోమల కరయుగ శాలి యగుచు.

12

లలిత సంకేత దేశమ్ము దెలియు నటుల
నూదు మృదువేణువున దాను నీదు పేరుఁ
గలికి! నీ దేహమును దాకు గాలిచేతఁ
గదలు ధూళిని గొప్పగా గౌరవించు.

13

పతతి పతత్రే విచలతి పత్రే
శంకిత భవ దుపయానం,
రచయతి శయనం సచకిత నయనం
పశ్యతి తవ పంథానమ్........ ధీర....

14

ముఖర మధీరం త్యజ మంజీరం
రిపు మివ కేళిషు లోలం,
చల సఖి! కుంజం సతిమిర పుంజం
శీలయ నీల నిచోలమ్....... ధీర....

15

ఉరసి మురారే రుపహిత హారే
ఘన ఇవ తరళ బలాకే,
తటి దివ పీతే! రతి విపరీతే
రాజసి సుకృత విపాకే ........ ధీర....

16

విగళిత వసనం పరిహృత రసనం
ఘటయ జఘన మపిధానం,
కిసలయ శయనే పంకజ నయనే!
నిధి మివ హర్షనిదానమ్........ ధీర....

13

ఆకు రాలిన సవ్వడియైన తెక్క-
బడిన శబ్దము వినిపింపఁ బడఁతి! నీవె
యంచు శంకించు, శయ్య రచించుఁ జకిత
కమల నయనుఁడై నీదు మార్గంబుఁ జూచు.

14

చెలియ! కేళివేళల శబ్దముల నొనర్చు
నందియల వీడు పగదాయు లని దలంచి
యింక నల్లని ముసుఁగు ధరించి పయన
మగుము జేరఁ గుంజము తమసావృతమ్ము.

15

కలికి! ముత్యాల హారముల్ గల మురారి
వెడఁద ఱొమ్మున నీవిఁక వెలయఁ గలవు.
తరళ తర బలాకాసహిత మగు జలద
పంక్తి నలరు మెఱపుగఁ బుంభావ మందు.

16

త్యక్తరసనము – గళితవస్త్రము - మనోహ
రం బనాచ్ఛాదనము - జఘనంబు నుంచు
లలిత కిసలయ శయన తలమున హర్ష
హేతువైన నిధిని వోలె నిందువదన!

17

హరి రభిమానీ రజని రిదానీ
మియ మపి యాతి విరామం,
కురు మమ వచనం సత్వర రచనం
పూరయ మధురిపు కామమ్.... ధీర....

[ శ్రీ జయదేవే కృతహరిసేవే భణిత పరమ రమణీయం
సముదిత హృదయం హరి మతి సదయం నమత సుకృత కమనీయమ్

18

వికిరతి ముహుః శ్వాసా న్నాశాః పురో ముహు రీక్షతే
ప్రవిశతి ముహుః కుంజాం గుంజన్ ముహు ర్బహు తామ్యతి.
రచయతి ముహు శ్శయ్యాం పర్యాకులం ముహు రీక్షతే
మదన కదన క్లాంతః కాంతే! ప్రియ స్తవ వర్తతే.

19

త్వద్వామ్యేన సమం సమగ్ర మధునా తిగ్మాంశు ర స్తం గతో
గోవిందస్య మనోరథేన చ సమం ప్రాప్తం తమ స్సాంద్రతాం
కోకానాం కరుణస్వనేన సదృశీ దీర్ఘా మదభ్యర్థనా
తన్ముగ్ధే! విఫలం విలంబన మసౌ రమ్యోఽ భిసారక్షణః.

20

సా మాం ద్రక్ష్యతి వక్ష్యతి స్మరకథాః ప్రత్యంగ మాలింగతి
ప్రీతిం యాస్యతి రంస్యతే సఖి! సమాగత్యేతి చింతాకులః
స త్వాం పశ్యతి వేపతే పులకయ త్యానందతి స్వేదతి
ప్రత్యుద్గచ్ఛతి మూర్ఛతి స్థిరతరః పుంజే నికుంజే స్థితః.

17

కాంత । అటు జూడు మీ రేయి గడచు చుండెఁ
జేయు మెంతేని నేను వచించినట్లు
దేవి! అభిమాని యైన రాజీవనయను
గామితంబును దీర్ప వేగముగ లెమ్మ.

18

కలయఁగఁ జూచు దిక్కులను గామిని । నీకయి నుస్సురంచు, నా
కులు కదలాడఁ జాలు వెదకుం బొదరింటను నీవ యంచు, రాఁ
గల దని పూలసెజ్జ నొడికంబుగఁ దీర్చు, క్షణక్షణంబుఁ దాఁ
గలఁత వడున్ మనోజ శర కాండములం జెలి! నీ ప్రియుండిటుల్.

19

నీ వక్రత్వము తోడ పూర్ణముగ మున్గెన్ నీరజాక్షుండదే
గోవింద స్పృహతో సమాన మగుచున్ గూడెన్ దమం బెంతయున్
గావింతున్ మొర నేను దైన్యముగఁ గోకాశోకముంబోలె, రా
జీవాక్షి! కడు రమ్య మీ సమయముం జేరంగదే శ్రీహరిన్

20

నను జూచున్ - వచియించు మారకథ - లానందించు - నాలింగనం
బొనరించున్ - రమియించు - వచ్చి చెలి యంచున్మాద చింతాకులం
బున దిక్కుల్ పరికించు - మోదమున నుప్పొంగున్ - జెమర్చుం - గడున్
వణకున్ - లేచును - జూచు - మూర్ఛిలు - తమః ప్రస్ఫీత కుంజంబునన్.

21

ఆశ్లేషాదను చుంబనాదను నఖోల్లేఖాదను స్వాంతజ
ప్రోద్బోధాదను సంభ్రమాదను రతారంభాదను ప్రీతయోః,
అన్యార్థం గతయో ర్భ్రమా న్మిళితయో స్సంభాషణై ర్జానతో
దంపత్యో రిహ కో న కో న తమసి వ్రీడా విమిశ్రో రసః

22

సభయచకితం విన్యస్యంతీం దృశౌ తిమిరే పథి
ప్రతితరు ముహుః స్థిత్వా మందం పదాని వితన్వతీం.
కథ మపి రహః ప్రాప్తా మంగై రనంగ తరంగిభిః
సుముఖి! సుభగః పశ్యన్ స త్వాముపైతు కృతార్థతామ్.

23

రాధాముగ్ధ ముఖారవింద మధుప స్త్రైలోక్య మౌళిస్థలీ
నేపథ్యోచిత నీల రత్న మవనీ భారావతారాంతకః,
స్వచ్ఛందం వ్రజసుందరీజనమన స్తోష ప్రదోషోదయః
కంస ధ్వంసన ధూమకేతు రవతు త్వాం దేవకీనందనః;

ఇతి శ్రీ జయదేవ కవికృతౌ గీతగోవిందకావ్యే,
అభిసారికావర్ణనే. సాకాంక్షపుండరీకాక్షో నామ
పంచమస్సర్గః

21

సరసాశ్లేషముఁ - జుంబనమ్ములు - విలాస బౌ నఖోల్లేఖముల్
స్మరవేగంబును - సంభ్రమంబు - రతి - తత్సంతోషముంగా నిటుల్
పరభోగేచ్ఛను జన్న దంపతులహో భ్రాంతిన్ మతిందామె యం
చెఱుఁగన్ మాటల వారిఁజెప్పవశమే యీ రాత్రి పెంజీకటిన్ ?

2

కడు భయమంది జూచుచును గాఢతమావృత మైన మార్గమ-
దడుగులు మెల్లగా నిడుచు, నాగుచు మాటికిఁజెట్టు చెట్టునన్
బడఁతి! యనంగవీచిక యనందగు నంగము లొప్పఁజేర, సం
దడి విని నిన్ను జూచుచు ముదంబున గృష్ణుఁడు సిద్ధిఁబొందుతన్

23

శ్రీ రాధా ముఖపద్మ షట్పదుఁడు - ధాత్రీభార రాజాంతకుం -
డారాధ్యుండు సమస్త లోకముల కత్యంతంబు - గోపాంగనా
మారాకారుఁడు — గంసమర్దనుఁడు — సంభావ్యుండు — మానాథుఁ, డిం
పారం బ్రోచుత దేవకీసుతుఁడు మీ కానందముల్ గూర్చుచున్.

ఇది గీతగోవింద కావ్యమందు
సాకాంక్ష పుండరీకాక్ష మను
పంచమ సర్గము.

## — షష్ఠసర్గః —

## — ధన్య వైకుంఠ కుంకుమః —

1

అథ తాం గంతు మశక్తాం
చిర మనురక్తాం లతాగృహే దృష్ట్వా
తచ్చరితం గోవిందే
మనసిజ మందే సఖీ ప్రాహ.

అ ష్ట ప దీ. 12

2

పశ్యతి దిశి దిశి రహసి భవంతం
తదధరపాన మధూని పిబంతం
నాథ! హరే! సీదతి
రాధాఽఽ వాసగృహే........ ధ్రువమ్.

3

త్వదభిసరణ రభ —
సేన వలంతీ,
పతతి పదాని కి —
యంతి చలంతీ ........ నాథహరే! ....

4

విహిత విశద బిస
కిసలయ వలయా,
జీవతి పర మిహ
తవ రతికలయా........ నాథ హరే....

## – షష్ఠసర్గము –

### – ధన్య వైకుంఠ కుంకుమము –

1

తానె హరిజేరుటకు శక్తి లేనిదాని
ప్రేమఁ జిరకాలముగఁ బొదరింట నున్న
దాని – రాధను గని, స్మరబాణ వివశుఁ
డైన హరితోఁడఁ జెలి యిట్టు లని వచించు.

**అష్టపది 12**

2

వల్లవీ మధురాధరామృత
పాన మత్తుఁడ వైన నిన్నే
దిక్కు దిక్కులఁ జూచి రాధిక
దిగులు పడు మిగులన్.

3

కౌతుకముతో నిన్ను జేరఁగ
కదలు ముందుకు కొన్ని యడుగులు,
తరుణి. తీవియ వోలెఁ దూలును
తడఁబడఁగ నడకల్

4

లేఁత తామర కాడలను నును
జేతులందున దాల్చినను త్వ
త్సరస రతి సంసక్త మనమున
దాల్చినది యసువుల్.

5

ముహు రవలోకిత
మండన లీలా
మధురిపు రహ మితి
భావన శీలా........ నాథహరే.

6

త్వరిత ముపైతి న
కథ మభిసారం,
హరి రితి వదతి స-
ఖీ మనువారమ్........ నాథహరే.

7

శ్లిష్యతి చుంబతి
జలధర కల్పం,
హరి రుపగత ఇతి
తిమిర మనల్పమ్........ నాథహరే.

8

భవతి విలంబిని, విగళిత లజ్జా
విలపతి రోదితి, వాసక సజ్జా........ నాథహరే.

[ శ్రీ జయదేవ కవే రిద ముదితం
రసిక జనం తనుతా మతిముదితం ]

5

లీల సింగారించుకొని సవ
రించుకొను మాటికిని జూచుచుఁ
దలఁచు "నేనే కృష్ణుఁ"డని డెం
దాన గోవిందా!

6

సకియ! యుగములు గడచె నిఁక నా
స్వామి కృష్ణుఁడు వచ్చు నెప్పటి
కనుచు నడుగు పదేపదే నను,
యదుకులాభరణా!

7

అదిగొ నా కృష్ణుండు వచ్చె న
టంచు జిక్కని మబ్బుఁబోలిన
చీకటిని దాఁ గౌఁగిలించును
చిరవియోగార్తిన్.

8

స్మరకళోచిత సాధనములను
సరసముగ సమకూర్చి యాల
స్యమును జేయఁగ నిన్ను దూరుచు
నమితముగ నేడ్చున్.

9

విపుల పులక పాళిః స్ఫీత సీత్కార మంత
ర్జనిత జడిమ కాకు వ్యాకులం వ్యాహరంతీ,
తవ కితవ! విధాయామంద కందర్ప చింతాం
రస జలధి నిమగ్నా ధ్యానలగ్నా మృగాక్షీ.

10

అంగే ష్వాభరణం కరోతి బహుశః పత్రేఽపి సంచారిణి
ప్రాప్తం త్వాం పరిశంకతే వితనుతే శయ్యాం, చిరం ధ్యాయతి,
ఇత్యాకల్ప వికల్ప తల్పరచనాసంకల్ప లీలా శత
వ్యాసక్తాపి వినా త్వయా వరతనుర్నైషా నిశాం నేష్యతి.

11

కిం విశ్రామ్యసి కృష్ణభోగిభవనే భాండీర భూమీరుహి
భ్రాత ర్యాసి న దృష్టిగోచర మితః సానంద నందాస్పదమ్,
రాధాయాః వచనం తదధ్వగముఖా న్నందాంతికే గోపతో
గోవిందస్య జయంతి సాయ మతిథ ప్రాశ స్త్యగర్భా గిరః.

ఇతి శ్రీ జయదేవ కవికృతౌ గీతగోవిందకావ్యే,
వాసకసజ్జావర్ణనే ధన్యవైకుంఠకుంకుమో నామ
షష్ఠ స్సర్గః

9

నిను మదిఁ జేర్చినంతటనె నిండ శరీరము నందు పుల్కలున్
ఘనముగ సీత్కృతంబుల నొనర్చుచు జాడ్య విశేషపూర్ణభా
వనమున నస్ఫుటంబుగను బల్కుచు దర్పక చింతచేత ము
న్గినది రసాబ్ధియందు తరుణీమణి ధూర్తుఁడ! ధ్యానలగ్నయై.

10

అమరన్ దేహ మలంకరించుకొను - నాకైనం జలింపం దలం
చు ముదంబొప్పఁగ నీవ యంచు-మరి దీర్చున్ శయ్య - ధ్యానించు డెం
దమునన్ - వేష వికల్ప తల్ప రచనాధ్యానంబులన్ మున్గియున్
కమనీయాంగికి నీవు లేక నిశ యేఁగంజాల దే రీతిగన్

11

అకటా! యేలిటు కృష్ణబోగి భవనం బైనట్టి యీ మట్టి చె
ట్టుకడన్ పొమ్మదె నందు నిల్లు గనుపట్టున్ జూడుమా యన్న రా
ధిక పల్కుల్ విని బాటసారి వలనన్ ధీశాలి యా, నందు నం
తిక మందున్ మరి దాచు గృష్ణుపలుకుల్ నిత్యంబు శోభిల్లు, న
వ్యకథా ధోరణిమించి సాయమతిథి ప్రాశస్త్య గర్వంబులై.

ఇది గీతగోవింద కావ్యమందు
ధన్యవైకుంఠ కుంకుమ మను
షష్ఠ సర్గము.

## — సప్తమసర్గః —

### — నాగరనారాయణః —

1

అత్రాంతరే చ కుటిలాకుల వర్త్మఘాత
సంజాత పాతక ఇవ స్ఫుటలాంఛనశ్రీః,
బృందావనాంతర మదీపయ దంశుజాలైః
దిక్సుందరీ వదన చందన బిందు రిందుః.

2

ప్రసరతి శశధర బింబే
విహిత విలంబే చ మాధవే విధురా,
విరచిత వివిధ విలాపం
సా పరితాపం చకారోచ్చైః

### అష్టపది — 13

3

కథిత సమయేఽపి హరి రహహ ! న యయౌ వనం
మమ విఫల మిద మమల రూప మపి యౌవనమ్
యామి హే కమిహ శరణం
సఖీజన వంచితాఽహం......... ధ్రువమ్.

4

యదనుగమనాయ నిశి
గహన మపి శీలితం,
తేన మమ హృదయ మిద
మసమశర కీలితమ్......... యామి హే....

## — సప్తమ సర్గము —

### — సాగరనారాయణము —

1

జార తరుణీ పథ నిరోధ జనిత పాప
మనఁ గళంకంబు విస్పష్ట మగుచు వెలయ,
వెలిఁగె ప్రాగ్వధూ ముఖ గంధ బిందు వటుల
నంత బృందావనంబున నమృతసూతి.

2

ఇందు బింబము క్రమముగ నెదుగు చుండ
మాధవుం డెంతయును విలంబనము సేయ
విరహభారంబుచే విలపించెఁ గలికి
పలువిధంబుల దుఃఖసంకలిత యగుచు

అష్టపది — 13

3

శౌరిరాడయ్యెఁ జెప్పిన సమయ మందు
వనమునకు — నేల నాదు యౌవనము రూప
వైభవము — నాకు శరణమెవ్వార లింక !
చెలుల మాటల నిట్లు వంచింపఁ బడితి.

4

ఇంత రాతిరి యెట్టులో నీ యరణ్య
మంత వెదకితి జాడలే దింతయైన
నైదు బాణాలు ప్రసవసాయకుఁడు నాదు
డెందమున నాటి చిందరవందఱ జేసె.

5

మమ మరణమేవ వర
మితి వితథ కేతనా.
కిమితి విషహామి విర -
హానల మచేతనా.... యామిహే.

6

మా మహహ ! విధురయతి
మధుర మధు యామినీ,
కాపి హరి మనుభవతి
కృత సుకృత కామినీ .... యామిహే.

7

అహహ! కలయామి వల
యాది మణిభూషణం.
హరి విరహదహన వహ
నేన బహు దూషణమ్ .... యామిహే.

8

కుసుమ సుకుమార తను
మతనుశర లీలయా,
స్రగపి హృది హంత మా
మతి విషమ శీలయా .... యామిహే.

5

మరణమే నాకు నిజముగ శరణమింక
నరయ వ్యర్థము పొదరింటియందు నిల్వ
నేల విరహానలంబు భరించుచుంటి ?
నకట! మిగుల నచేతనురాల నగుచు.

6

సంతస మొనర్చు రమ్య వసంత రాత్రి
నన్ను వేధించుచున్నదీ నడుమ నొక్క-
కామిని మురారిఁ గదిసి సుఖంబు నందు
నెంత పున్నెము నేసినదేమొ కాని.

7

రత్న భూషణములు సువర్ణ వలయములు
నిందనీయము లంచు నెడంద నెంతు
నరక దానవ దమను దుర్భర వియోగ
వహ్ని కీలల గ్రమ్ముట వలన నిపుడు.

8

నేను దాల్చిన పూదండ నేడు. విషమ
శీలమును గల్గి యౌర! హింసించుచుండె
స్మరుని దారుణ శర విలాసంబు రీతి
సుమ మృదుల మైన నా శరీరమును మిగుల.

9

అహ మిహ నివసామి న
గణిత వనవేతసా,
స్మరతి మధుసూదనో
మామపి న చేతసా .... యామిహే! ....

[ హరి చరణ శరణ జయదేవ కవిభారతీ
వసతు హృది యువతి రివ కోమల కలావతీ. ]

10

తత్కిం కామపి కామినీ మభిసృతః, కింవా కళాకేళిభి
ర్బద్ధో బంధుభి, రంధకారిణి వనాభ్యర్ణే కి ముద్భ్రామ్యతి,
కాంతః క్లాంతమనా మనాగపి పథి ప్రస్థాతు మేవాక్షమః
సంకేతీకృత మంజు వంజుల లతా కుంజేఽపి యన్నాగతః

11

అథాగతాం మాధవ మంతరేణ
సఖీ మియం వీక్ష్య విషాద మూకాం.
విశంక మానా రమితం కయాపి
జనార్దనం దృష్టవ దేత దాహ.

12

అష్టపది – 14

స్మరసమరోచిత విరచిత వేశా
గళిత కుసుమ దర విలులిత కేశా,
కాపి మధురిపుణా
విలసతి యువతి రత్యధిక గుణా.... ధ్రువమ్.

9

అతి విరస మైన యీ నికుంజాంతరమున
వేయి కన్నుల నే నిటు వేచియుంటిఁ,
గాని మధుసూదనుఁడు నన్ను మానసమున
నెంత మాత్రము దాను స్మరింపకుండె.

10

ఔర! వేఱొక్క కాంతకై నరిగె నేమొ?
మసలెనో గాకఁ జుట్టాల మాటలందు,?
నన్ను జీకట్ల వెదకుచున్నాఁడొ? రాక
పోయెఁ బొదరింటి కస్వస్థుఁడాయె నేమొ?

11

అంత నొక చెలి మాధవు చెంత నుండి
వచ్చి దుఃఖముతో నేమి పలుకకున్న
రాధ హరి నన్యవనితతో రక్తి నున్న
వానిఁగా నెంచి జూచినపగిది పలుకు.

అ ష్ట ప ది. 14

12

స్మర సంగరమునకు సముచితం బైన
వేషంబు గై సేసి వేడ్కలు మీఱ
కేశపాశంబు సంక్లిష్టంబు గాఁగ
జల జల మంచు పువ్వులు రాలుచుండ.

13

హరి పరిరంభణ
వలిత వికారా,
కుచకలశోపరి
తరళిత హారా.... కాపి.

14

విచల దలక లలి -
తానన చంద్రా,
తదధర పాన ర-
భస కృత తంద్రా .... కాపి.

15

చంచల కుండల
దళిత కపోలా,
ముఖరిత రశన జ-
ఘన గతిలోలా .... కాపి

16

దయిత విలోకిత
లజ్జిత హసితా,
బహువిధ కూజిత
రతిరస రణితా, .... కాపి.

13

కాంతుఁడు బిగియారఁ గౌఁగిలింపంగ
తనువెల్ల పులకించి మనసు రంజిల్ల.
కుచకుంభముల మీఁదఁ గొలువున్న యట్టి
ముత్యాల హారాలు మురిసి యాడంగ.

14

ముంగురు లాడంగ ముఖబింబ మందు
నింపైన సోయగం బిగురులొత్తంగ
ముద్దార రమణుని మోవిపానకము.
గ్రోలుచు మదిని సొక్కుచు మిక్కుటముగ

15

మాటికి నెగురుచు మణికుండలములు
తాడించుచుండ మెత్తగఁ గపోలముల.
గణ గణ మంచు మేఖల మ్రోయుచుండఁ
గడు విచిత్రంబుగఁ గటిని ద్రిప్పుచును.

16

కాంతుఁడు దను జూడఁ గమనీయముగను
సిగ్గుతో గూడిన చిఱునవ్వు నగుచు
పలు విధాలైనట్టి కలకూజితముల
రతి రసావేశ నిర్భర హర్షయగుచు.

17

విపుల పులక పృథు
వేపథు భంగా,
శ్వసిత నిమీలిత
వికస దనంగా .... కాపి.

18

శ్రమ జల కణ భర
సుభగ శరీరా,
పరిపతితోరసి
రతిరణ ధీరా.... కాపి.

[ శ్రీ జయదేవ భణిత హరి రమితం
కలి కలుషం జనయతు పరిశమితమ్. ]

19

విరహ పాండు మురారి ముఖాంబుజ
ద్యుతిరయం తిరయ న్నపి వేదనాం
విధురతీవ తనోతి మనోభువః
సుహృదయే హృదయే మదన వ్యథామ్.

17

పులకలు నిలువెల్ల మోసు లెత్తంగ
నలల రీతిగ దేహ మల్లల నాడ
నధికంపు టూర్పుల నరమోడ్పు కనుల
నంగజు భావంబు స్పష్టమై విరియ.

18

సురతశ్రమంబుచే నిరతంబు పొంగు
స్వేదాంబు పూరంబుచే మేను వెలుఁగ
కందర్ప దర్ప సంగర రంగ ధీర
హరి యురమందున నవశయై వ్రాలి.

( కాపి – 12 )

అధిక గుణంబుల నలరారు నొకతె
మధువైరితో గూడి మగువ క్రీడించు.

19

విరహ పాండు హరి ముఖారవింద కాంతి
గల్గి వెల్గెడి యీ హిమకరుఁడు తాప
మపనయించినఁగాని యనంగుని జెలి-
కాఁడగుట డెందమున బాధఁ గలుగఁ జేసె

## అష్టపది – 15

20

సముదిత మదనే రమణీ వదనే
చుంబన వలితాధరే,
మృగమదతిలకం లిఖతి సపులకం
మృగ మివ రజనీకరే
రమతే యమునా పులినవనే
విజయీ మురారి రధునా.... ధ్రువమ్.

21

ఘనచయరుచిరే రచయతి చికురే
తరలిత తరుణాననే
కురవక కుసుమం చపలా సుషమం
రతిపతి మృగకాననే.......... రమతే.

22

ఘటయతి సుఘనే కుచయుగ గగనే,
మృగమివ రుచి రూషితే,
మణిసర మమలం తారక పటలం
నఖపద శశి భూషితే........ రమతే.

24

జిత బిస శకలే మృదుభుజయుగళే
కరతల నళినీదళే
మరకత వలయం మధుకర నిచయం
వితరతి హిమశీతలే........ రమతే.

## అష్టపది – 15

20

చుంబన మనోజ్ఞ లలితాధరంబు, మోహ
సదనము. రమణి రమణీయ వదన మందు
తరుణి! మృగమును వలె నిశాకరుని యందు
దిద్దు మృగమద తిలకంబు ముద్దు లొలుక.
రమ్య యమునా తరంగిణీ ప్రాంతపులిన
తలమున మురారి క్రీడించుc జెలియ! యిపుడు.

21

కాముc డను జింక తిరిగెడి కాననంబు -
జలద సంచయ రుచి మనోజ్ఞంబు - తరుణ
మనసులc జలింపcజేయు గొప్పున దటిత్ప్ర
భా సమం బగు కురవక ప్రసవ ముంచు.

22

సరస కస్తూరికా కాంతి సంయుతంబు.
నవ్య నఖపద శశి మండనంబు. సుఘన
మైన కుచయుగ గగనంబు నందు గాంత
విమల మణిసర తారాగణము ఘటించు.

23

హైమ శీతలములు – బిసకోమలములు -
కరతలాంబుజ పత్ర సుందరము లైన
మృదుల భుజముల నతివ! షట్పదగణంబు
బోలు మరకత కంకణంబులను దొడుగు.

24

రతిగృహ జఘనే విపులాపఘనే
మనసిజ కనకాసనే,
మణిమయ రసనం తోరణ హసనం
వికిరతి కృతవాసనే ... రమతే.

25

చరణ కిసలయే కమలా నిలయే
నఖ మణి గణ పూజితే,
బహి రపవరణం యావక భరణం
జనయతి హృది యోజితే ...... రమతే.

26

రమయతి సుభృశం కామపి సుదృశం
ఖల హలధర సోదరే,
కిమఫల మవసం చిర మిహ విరసం
వద సఖి! విటపోటరే...... రమతే.

[ ఇహ రసభణనే కృతహరి గుణనే, మధురిపు పదసేవకే
కలియుగ రచితం న వసతు దురితం, కవినృప జయదేవకే. ]

27

నాయాత స్సఖి! నిర్దయో యది శఠ_స్త్వం దూతి! కిం దూయసే
స్వచ్ఛందం బహువల్లభ స్స రమతే కిం తత్ర తే దూషణం,
పశ్యాద్య ప్రియ సంగమాయ దయిత స్యాకృష్యమాణం గుణై
రుత్కం ఠా_ర్తిభరా దివ స్ఫుట దిదం చేత స్స్వయం యాస్యతి.

24

అతివ! కృతవసనము – విపులాపఘనము -
నంగభవునకు కనక సింహాసనంబు -
నైన రతిగృహ జఘనంబు నందు తోర
ణమ్మను హసించు మణిరసనమ్మ నుంచు.

25

కమల కావాస భూమి - నఖమణిపూజి
తమ్మ - పాదకిసలయ యుగమ్మ - హృదయ
మందు జేరిచి యధిక మోహమునఁ జెలియ!
పూయు లాక్షారసంబు పైపూతగాఁగ.

26

ఎవతెనో గూడి మిగులఁ గ్రీడించుచుండ
హలధరుని సోదరుండు నిరర్థకముగ
నింత వఱకును పూఁబొదరింటి యందుఁ
గాచి విసిగితి ఫల మొండు గలదె సెపుమ ?

27

చెలి రాడాయెనె నిర్దయుండు శఠుఁడున్ జింతింప నేలా? యథే
చ్ఛ లతాంగీయుతుఁడై రమించుఁ దగునే సంతాపముం జెంద? మి
క్కిలి యారాటము చేత ముక్కలయి యాకృష్యంబునై తద్గుణం
బులఁ దత్సంగతిఁ గోరు నా మనసు పోవుం జూడు తానే యిఁకన్,

అ ష్ట ప ది. — 16

28

అనిల తరళ కువలయ నయనేన
తపతి న సా కిసలయ శయనేన,
సఖి ! యా రమితా వనమాలినా........ ధ్రువమ్.

29

వికసిత సరసిజ
లలిత ముఖేన
స్ఫుటతి న సా మన -
సిజ విరహేన........ సఖి. యా,

30

అమృత మధుర మృదు -
తర వచనేన,
జ్వలతి న సా మల -
యజ పవనేన........ సఖి ! యా.

31

స్థల జలరుహ రుచి
కర చరణేన
లుఠతి న సా హిమ -
కర కిరణేన........ సఖి! యా.

## అష్టపది — 16

28

గాలి తాకిడి చేత గదలించఁ బడిన
కలువలం బోలిన గన్నులు గలుగు
వనమాలిఁ గూడి యే వనిత క్రీడించె
నది పూలఁబాన్పుచే నందదు బాధ.

29

బాగుగా వికసించి వాసనల్ జల్లు
కమలంబు వంటి చక్కని మోము గల్గు
వనమాలిఁ గూడి యే వనిత క్రీడించె
నది కాము శరముల నందదు బాధ.

30

అమృతంబు వలె తీయనై మెత్తనైన
పలుకుల నేర్పుతో వలపుఁ బండించు
వనమాలిఁ గూడియే వనిత క్రీడించె
నది గంధపవనాన నందదు బాధ -

31

స్థల కమలముల సౌందర్యంబు మించు
కరములు పాదాలు కల్గి యున్నట్టి
వనమాలిఁ జేరి యే వనిత క్రీడించె
నది చంద్రికిరణాల నందదు బాధ.

32

నీరంబుతో గూడి నెగడు మేఘముల
కమనీయ కాంతిని గల్గి వెల్గొందు
వనమాలిఁ జేరి యే వనిత క్రీడించె
నది వియోగంబుచే నందదు బాధ.

33

పదియాఱు వన్నెల బంగారు కాంతిఁ
జిందించు వస్త్రంబుచే వెల్గుచున్న
వనమాలిఁ జేరి యే వనిత క్రీడించె
నది పరిజనహాస మందదేనాడు.

34

అఖిల లోకములందు నలరారు నట్టి
యువజనంబుల యందు యోగ్యుఁ డైనట్టి
వనమాలిఁ జేరి యే వనిత క్రీడించె
నది మనఃక్లేశంబు నందదేనాడు

35

మన్మథానంద సంధాన మలయ పవన!
యోరి దక్షిణ! వక్రత్వ ముజ్జగింపు,
మో జగత్ప్రాణ! మాధవు నుంచి ముందు
నన్ను గావుము లేక హంతకుఁడ వగుదు.

36

రిపురివ సఖీ సంవాసోఽయం శిఖీవ హిమానిలో
విష మివ సుధారశ్మి ర్యస్మి న్దునోతి మనోగతే,
హృదయ మదయే! తస్మి న్నేవం పున ర్వలతే బలా
త్కువలయ దృశాం వామః కామో నికామ నిరంకుశః.

37

బాధాం విధేహి మలయానిల! పంచబాణ!
ప్రాణాన్ గృహాణ న గృహం పున రాశ్రయిష్యే.
కిం తే కృతాంతభగిని! క్షమయా తరంగై
రంగాని సించ మమ శామ్యతు దేహతాపః.

38

ప్రాత ర్నీల నిచోల మచ్యుత మురః స్సంవీత పీతాంశుకం
రాధాయా శ్చకితం విలోక్య హసతి స్వైరం సఖీ మండలే,
వ్రీడా చంచల మంచలం నయనయో రాధాయ రాధాననే
స్వాదు స్మేర ముఖోఽయ మస్తు జగదానందాయ నందాత్మజః.

ఇతి జయదేవ కవికృతౌ గీతగోవింద కావ్యే
విప్రలబ్ధా వర్ణనే నాగరనారాయణో నామ
సప్తమ స్సర్గః.

36

స్మరణముచేత నెచ్చెలులు సఖ్యము శత్రువుగా - సుధాంశుఁడున్
గరళముగా - హుతాశనముగా మలయానిలుఁ - డిట్లు తాపముం
గరము రగిల్చ, నైనను మనంబు సదా, హరియందె లగ్నమౌ
నరయఁగఁ గాముఁ డంగనల యందు నిరంకుశవక్రుఁ డెంతయున్.

37

మించి మలయమారుతమ! బాధించు మదన!
యసువులను గొమ్ము గృహమున కరుగ నేను
యముని చెల్లెల! నీవైన నలలఁ దడిపి
యంగముల దేహసంతాప మపనయింపు.

38

అల నీలాంబరధారివై వెలుఁగు కంజాక్షుం బ్రభాతంబునన్
వెలయన్ రాధను రమ్యపీత వసనాన్వితన్ విచిత్రింబుగా
చెలు లీ మార్పును జూచి నవ్వఁగఁ - గడున్ సిగ్గందిక్రీగంటి జూ
పులతోఁ గాంతను జూచి నవ్వు హరి దాఁ బ్రోచున్ సదా లోకముల్.

ఇది గీతగోవింద కావ్యమందు
నాగర నారాయణ మను
సప్తమ సర్గము.

## – అష్టమ సర్గః –

### – విలక్ష లక్ష్మీపతిః –

1

అథ కథమపి యామినీం వినీయ
స్మరశర జర్జరితాపి సా ప్రభాతే,
అనునయ వచనం వదంత మగ్రే
ప్రణత మపి ప్రియ మాహ సాభ్యసూయమ్.

అష్టపదీ – 17

2, 3

రజని జనిత గురు జాగర రాగ క
షాయిత మలస నివేశం,
వహతి నయన మనురాగ మివ స్ఫుట
ముదిత రసాభినివేశం.

హరి హరి ! యాహి కేశవ ! యాహి మాధవ ః
మావద కైతవ వాదం
తామనుసర సరసీరుహలోచన !
యా తవ హరతి విషాదమ్ ........ ధ్రువమ్.

4

కజ్జల మలిన విలోచన చుంబన
విరచిత నీలిమ రూపం,
దశన వసన మరుణం తవ కృష్ణ ! త -
నోతి తనో రనురూపం ........ హరి హరి.

## — అష్టమ సర్గము —

### — విలక్ష లక్ష్మీపతి —

1

ఎటులనో రాధ రేయి ముగించి. మదన -
బాణ హత యైనఁ గాని ప్రభాత మందు
నమ్రుఁడై మ్రోలఁ బ్రియవచనములు బలుకు
హరిని కనుఁగొని పలుకు నీర్ష్యను వహించి.

2

రాత్రి జాగరమున నెఱ్ఱవడుచు మిగుల
సరస శృంగార రస నివేశమ్ము నగుచు
మూఁత వడుచును నీ నేత్రములు వెలుంగు
స్ఫుటముగా ననురాగముఁ బొందినటుల.

3

పలుక వలదింక మాయ మాటలను గృష్ణ!
చాలు మాధవ! కేశవ! చాలు లెమ్ము
వెళ్లు మామె సన్నిధి కరవిందనయన!
యెవతె నీదు వేదన హరియింపఁ గలదొ!

4

రక్తిమం బైన నీ యధరంబు నేడు
నల్లనయ్యె మురారి! యే నాతి కాటు
క కనులను ముద్దుగొంటివో కపటి! నీదు
దేహమున కనురూపమై తేజరిల్లె.

5

వపు రనుహరతి తవ స్మర సంగర
ఖర నఖర క్షత రేఖః,
మరకత శకల కలిత కలధౌత లి -
పేరివ రతిజయ లేఖమ్ ......... హరిహరి.

6

చరణ కమల గల దలక్తక సిక్త మి -
దం తవ హృదయ ముదారం,
దర్శయతీవ బహి ర్మదనద్రుమ
నవకిసలయ పరివారమ్ ........ హరిహరి.

7

దశనపదం భవ దధరగతం మమ
జనయతి చేతసి ఖేదం,
కథయతి కథ మధునాపి మయా సహ
తవ వపు రేత దభేదమ్ ........ హరిహరి.

8

బహిరివ మలినతరం తవ కృష్ణ! మ -
నోఽపి భవిష్యతి నూనం,
కథ మథ వంచయసే జన మనుగత
మసమశర జ్వర దూనమ్ ........ హరిహరి.

5

కామ సంగ్రామ తీవ్ర నఖక్షతముల
నంకితం బైన నీ దేహ మలరె నేడు
నీలమణిమీఁద స్వర్ణాక్షరాల వ్రాసి
నట్టి రతిజయపత్ర సామ్యమున గృష్ణ!

6

ఏ రమణి పాదపద్మ లాక్షారసమున
సిక్త మైనదొ నీ ఱొమ్ము ర క్తిఁ దెలుపు
భావజ మహీజ నవ పల్లవముల, గుంపు
పైకిఁ జూపు విధంబున పరిఢవిల్లి.

7

ఏ యిగురుఁబోఁడి పంటికాటిందు కృష్ణ!
నీదు తియ్యంపు మోవిపై నెగడు చుండె
నాకు దుఃఖము కల్గె యీనాడు గూడ
నెటుల మనకు నభేదంబు పొటమరించె.

8

పైన నెట్టుల నల్లై లోపలను గూడ
నలుపె కలదిట్లు నీకు గృష్ణా! నిజంబు
కామ తాపాగ్ని నీకునై గ్రాగుచున్న
నన్నె మోసము జేయుచున్నావు గాదె?

9

భ్రమతి భవా నబలా కబళాయ వ-
నేషు కిమత్ర విచిత్రం,
కథయతి పూతనికైవ వధూ వధ
నిర్దయ బాల చరిత్రమ్ ........ హరిహరి.

[ శ్రీ జయదేవ భణిత రతి వంచిత ఖండిత యువతి విలాపం
శ్రుణుత సుధా మధురం విబుధా విబుధాలయతోఽపి దురాపమ్ ]

10

తవేదం పశ్యంత్యాః ప్రసర దనురాగం బహి రివ
ప్రియాపాదాలక్త చ్ఛురిత మరుణద్యోతి హృదయం,
మమాద్య ప్రఖ్యాత ప్రణయ భర భంగేన కితవ !
త్వదాలోకః శోకాదపి కిమపి లజ్జాం జనయతి.

11

అంత ర్మోహన మౌళి ఘూర్ణన చల న్మందార విభ్రంశన -
స్తంభాకర్షణ దృష్టిహర్షణ మహామంత్రః కురంగీదృశాం
దృప్య ద్దానవ దూయమాన దివిష ద్దుర్వార దుఃఖాపదాం
భ్రంశః కంసరిపో ర్వ్యపోలయతు వః శ్రేయాంసి వంశీరవః,

ఇతి శ్రీ జయదేవ కవికృతౌ గీతగోవిందకావ్యే
ఖండితావర్ణనే విలక్షలక్ష్మీపతి ర్నామ
అష్టమ స్సర్గః

9

ప్రథితమే గద యబలల ప్రాణములను
మ్రింగ వనములలో సంచరింతు వీవు.
చిత్ర మేమున్న దిందు నీ చిన్ననాడె
పూతనికఁబట్టి కూలార్పవో మురారి!

10

వనితా పాద సరోజ యావక రస స్వచ్ఛంద సంసిక్తమై
యనురాగంబును బైకి జూపు గతి నవ్యంబైన నీ వక్షముం
గనఁ బ్రఖ్యాత మదీయ హృత్ప్రణయ భంగంబైన గానీయిఁకన్
ఘనమౌ లజ్జ జనించు. దుఃఖ మది కల్గంబోదు ధూర్తాగ్రణీ!

11

మది మోహంబును – మూర్ధచాలన చల న్మందార విభ్రంశనా
స్పదమున్ - స్తబ్ధవశంబు - నేత్రయుగ పర్వంబౌ మహామంత్ర మీ
మదిరాక్షీతతికెల్ల – దైత్య చయ సంభ్రాంతాదితేయాళి గ
ష్టదశం దీర్చు మురారి వేణురవముల్ సంధించుతన్ శ్రేయముల్.

ఇది గీతగోవిందకావ్య మందు
విలక్ష లక్ష్మీపతి యను
అష్టమ సర్గము.

## — న వ మ స ర్గః —

## — ముగ్ధముకుందః —

1

తా మథ మన్మథ ఖిన్నాం
రతిరస భిన్నాం విషాద సంపన్నా —
మనుచింతిత హరిచరితాం
కలహాంతరితా ముహాచ రహసి సఖీమ్,

### అ ష్ట ప ది — 18

2

హరి రభిసరతి వహతి మధుపవనే
కిమపర మధిక సుఖం సఖి ! భవనే.
మాధవే మాకురు
మానిని ! మానమయే ........ ధ్రువం.

3

తాళఫలా దపి
గురు మతి సరసం,
కిం విఫలీ కురు —
షే కుచ కలశమ్ ........ మాధవే.

4

కతి న కథిత మిద
మనుపద మచిరం.
మా పరిహర హరి
మతిశయ రుచిరమ్........ మాధవే.

## – నవమ సర్గము –

### – ము గ్ధ ము కు ం ద ము –

1

స్మర శర సమూహతప్త – విషాద సహిత -
రతి రసాస్తక చిత్త – చింతిత మురారి
చరిత – కలహాంతరిత – యైన సఖిని గాంచి
యంత నెచ్చెలి బలుకు నేకాంత మందు.

### అ ష్ట ప ది – 18

2

మలయ వాయువు వీచుచుండఁగ
మగువ ! నీకయి వచ్చు శ్రీహరి
కలదె సుఖ మిట, మాధవునిపై
నలుక నీకేల ?

3

తాళ ఫలముల కన్న ఘనములు
తరుణి ! రస సంపూర్ణ యుతములు,
నిట్లు కుచకుంభముల వ్యర్థం
బేల గావింతు ?

అఖిల లోక మనోహరుం డగు
నచ్యుతుని విడనాడవలదిఁక
చెలియ ! యెన్ని విధాలనో మును
జెప్పితిని గాదె ?

5

కిమితి విషీదసి
రోదిషి వికలా.
విహసతి యువతి స -,
భా తవ సకలా, .... మాధవే.

6

మృదు నళినీ దళ
శీతల శయనే !
హరి మవలోకయ.
సఫలయ నయనే.... మాధవే.

7

జనయసి మనసి కి
మితి గురుఖేదం.
శృణు మమ వచన మ –
నీహిత భేదమ్.... మాధవే.

8

హరి రుపయాతు వ –
దతు బహు మధురం
కిమితి కరోషి హృ –
దయ మతి విధురమ్.... మాధవే.

5

నాతి! యెందుకు దైన్యముగ ను
న్నావు కన్నుల నీరు నించెదు?
చెలులు నవ్వుచునున్నవారీ
చేష్టలను గాంచి.

6

సజల నళినీ పత్ర శీతల
శయ్య యందున నున్న రాధిక!
కృష్ణుఁ జూడుము రెండుకన్నుల
తృష్ణ దీరంగ.

7

స్వాంతమున చింతించుచేదో
బాధ చెందుచు నున్నదానవు.
ప్రాణసఖి నగునే వచించిన
పలుకులను వినుము.

8

హృదయ తాపము ననుభవించెద
వేల? శ్రీహరి నిన్ను జేరును
మృదుల వాగమృతమున నీకతి
ముదము జేకూర్చు.

[ శ్రీ జయదేవ భణిత మతిలలితం
సుఖయతు రసికజనం హరి చరితమ్ ]

9

స్నిగ్ధే! యత్పరుషాసి యత్ప్రణమతి స్తబ్ధాసి యద్రాగిణీ
ద్వేషస్థాసి యదున్ముఖే విముఖతాం యాతాసి తస్మిన్ ప్రియే,
తద్యుక్తం విపరీతకారిణి! తవ శ్రీఖండ చర్చా విషం
శీతాంశు స్తపనో హిమం హుతవహః క్రీడాముదో యాతనాః.

10

సాంద్రానంద పురందరాది దివిష ద్బృందై రమందాదరా
దానమ్రై ర్ముకుటేంద్ర నీల మణిభి స్సందర్శితేందిందరం,
స్వచ్ఛందం మకరంద సుందర గల న్మందాకినీ మేదురం
శ్రీ గోవింద పదారవింద మశుభ స్కందాయ వందామహే.

ఇతి శ్రీ జయదేవ కవికృతౌ గీతగోవింద కావ్యే
కలహాంతరితా వర్ణనే ముగ్ధముకుందో నామ
నవమ స్సర్గః.

9

లలనా! చేరఁగ నిష్ఠురంబు - బ్రతిమాలన్ మౌనముద్రన్ - మదిన్
వలపుం జూపఁగ శాత్రవంబు — సరసత్వంబందు వైముఖ్యముం -
గల నీకౌఁ గద యెంతయేని విషమున్ గంధంపు మైఁబూత, శీ
తలపాదుండును సూర్యుఁ, డగ్ని హిమమున్, దాపంబు సయ్యాటలున్

10

సతమున్ గౌరవ మొప్ప సంతసముతో శక్రాది బృందారక -
ప్రతతుల్ మ్రొక్కఁ గిరీట నీలమణి శోభల్ దుమ్మెదల్ గాగ, సం
గత మాధుర్య మరంద సుందర గళ ద్గంగానదీ స్నిగ్ధ మ
చ్యుతుపాదః కమలంబు గొల్చెదము శ్రేయోభావ సంసిద్ధికై.

ఇది గీత గోవిందకావ్య మందు

ముగ్ధముకుంద మను

నవమ సర్గము.

## — దశమ సర్గః —

### — చతుర చతుర్భుజః —

1

అత్రాంతరే మసృణ రోష వశా మపార -
నిశ్శ్వాస నిస్సహ ముఖీం సుముఖీ ముపేత్య.
సవ్రీడ మీక్షిత సఖీవదనాం దినాంతే
సానంద గద్గద పదం హరి రిత్యువాచ.

### అ ష్ట ప దీ — 19

2, 3

వదసి యది కించి దపి దంతరుచి కౌముదీ
హరతి దర తిమిర మతిఘోరం
స్ఫుర దధర శీధవే తవ వదన చంద్రమా
రోచయతు లోచన చకోరం.

ప్రియే చారు శీలే! ప్రియే చారుశీలే
ముంచ మయి మాన మనిదానం.
సపది మదనానలో దహతి మమ మానసం
దేహి ముఖకమల మధుపానమ్........ ధ్రువం.

4

సత్య మేవాసి యది సుదతి! మయి కోపినీ
దేహి ఖర నఖర శరఘాతం.
ఘటయ భుజ బంధనం జనయ రద ఖండనం
యేన వా భవతి సుఖ జాతమ్ ........ప్రియే.

## — దశమ సర్గము —

### — చతుర చతుర్భుజము —

1

అంత సాయంతనమున దైత్యారి, కోప
పరవశ – నితాంత నిశ్శ్వాస వదన – యగుచు
వ్రీడఁ జెలి మోముఁ జూచు పూఁబోఁడిఁ జేరి
ప్రణయ గద్గద వాక్కుఁడై పలుకు నిట్లు.

2

ఏదొ పలుకంగ నుంకించితేని కాంత !
దంత రుచి కౌముది హరించు దరతిమరము,
నధర సుధ నిచ్చి ముఖచంద్రుఁ డధిక హర్ష
కారి యగుత నా నేత్ర చకోరములకు.

3

పరిహరింపు మనర్థ కోపంబు రాధ !
మానసంబు దహించెడి మన్మథాగ్ని,
యమృత మయమైన నీ ముఖకమల మధువు
త్రావ నిమ్ము యథేచ్ఛగఁ దన్వి! యిపుడు.

4

నీవు కోపించినట్లైన నిక్కువముగఁ
దీవ్రముగ గోటికాట్ల బాధింపరాదొ ?
రమణి! కౌఁగిఁట బంధింపరాదొ ? సుఖము
కలుగ దంతక్షతంబులు సలుపరాదొ ?

5

త్వమసి మమ భూషణం త్వమసి మమ జీవనం
త్వమసి మమ భవ జలధి రత్నం.
భవతు భవతీహ మయి సతత మనురోధినీ
తత్ర మమ హృదయ మతి యత్నమ్ ........ప్రియే.

6

నీల నళినాభ మపి తన్వి! తవ లోచనం
ధారయతి కోకనద రూపం.
కుసుమ శర బాణ భావేన యది రంజయసి
కృష్ణ మిద మేత దనురూపమ్! ........ప్రియే.

7

స్ఫురతు కుచకుంభయో రుపరి మణిమంజరీ
రంజయతు తవ హృదయదేశం,
రసతు రసనాపి తవ ఘన జఘన మండలే
ఘోషయతు మన్మథ నిదేశమ్:........ ప్రియే....

8

స్థల కమల గంజనం మమ హృదయ రంజనం
జనిత రతిరంగ పరభాగం.
భణ! మసృణవాణి! కరవాణి చరణ ద్వయం
సరస సదలక్తక సరాగమ్........ ప్రియే....

5

నీవె నా భూషణము, మరి నీవె జీవ
నమ్ము సంసార జలధి రత్నమ్ము నీవె,
నన్ననుసరింపు వేడుచున్నాను నిన్ను
నాదు యత్నము దానికై గాదె యెపుడు

6

నీల నళినాభ మైన నీ నేత్రయుగము
చెలువ ! యిపుడు రక్తోత్పలశ్రీ వహించె
సముచితంబగు స్మరశరత్వము భజించి
యెంతయును గృష్ణునన్ను రంజించె దేని

7

మణుల హారాలు కుచ కుంభ మండలమున
వక్షమున కలంకారమై పరలుగాత
మ్రోగుగాత ఘన జఘనమున మనోజు
నాజ్ఞఁ జాటుచు నొడ్డాణ మధికరక్తి.

8

నా హృదయ రంజనము — స్థల నళిన వైరి —
సరస రతిరంగ సుప్రకాశమ్ము — నీదు
చరణ యుగళికి లాక్షారసంబు నిపుడు
పలుకు మొకసారి పూసెద లలిత వాణి !

9

స్మర గరళ ఖండనం మమ శిరసి మండనం
దేహి పద పల్లవ ముదారం.
జ్వలతి మయి దారుణో మదన కదనారుణో
హరతు తదుపాహిత వికారమ్.......... ప్రియే —

[ ఇతి చటుల చాటు పటు చారు మురవైరిణో
రాధికా మధి వచన జాతం
జయతి జయదేవ కవి భారతీ భూషితం
మానినీ జన జనిత శాతం ]

10

పరిహర కృతాతంకే! శంకాం త్వయా సతతం ఘన
స్తన జఘనయాక్రాంతే స్వాంతే పరానవకాశిని,
విశతి వితనో రన్యో ధన్యో న కోఽపి మమాంతరం
ప్రిణయిని! పరిరంభా రంభే విదేహి విధేయతామ్.

11

ముగ్ధే! విధేహి మయి నిర్దయ దంత దంశ
దోర్వల్లి బంధ నిబిడ స్తన పీడనాని,
చండి! త్వమేవ ముద ముద్వహ పంచబాణ
చాండాల కాండ దళనా దసవః ప్రయాంతి.

12

శశిముఖి! తవ భాతి బంధురభ్రూః
యువజన మోహ కరాళ కాల సర్పీ,
తదుదిత విష భంజనాయ యూనాం
త్వ దధర సీధు సుధైవ సిద్ధమంత్రః.

9

స్మర గరళ ఖండనము – శిరో మండనమ్ము –
చరణ పల్లవ – ముంచు నా శిరము నందు
దారుణుండు మదన కదనారుణుండు
మండు నాలోన తాపంబు మాన్చుగాత

10

ఏలనే శంక ? స్తన జఘనాల నీవె
నిండితివి స్వాంతమున, సతనుండు దప్ప
నితరుఁ డిందుఁ బ్రవేశించు నెట్లు ? ప్రణయి
నీ! పరీరంభణము నిచ్చి తాప మణఁచు.

11

తరుణి! పీడించు దంతక్షతాల దయను
వదలి కుచముల దోర్వల్లి బంధనముల
చండి ! మన్మథ చండాల కాండములకుఁ
జిదికె నసువులు మరి సంతసింపు మీవె.

12

ఇందుముఖి! యువకులను మోహింపఁజేయు
కాల సర్పము వలె వెల్గు గాదె నీదు
కనుబొమ, తదీయ విష వినాశనము నందు
సిద్ధ మంత్రము త్వదధర శీధు సుధయె.

13

వ్యథయతి వృథా మౌనం తన్వి! ప్రపంచయ పంచమం
తరుణి! మధురాలాపై స్తాపం వినోదయ దృష్టిభిః,
సుముఖి! విముఖీ భావం తావ ద్విముంచ న ముంచ మాం
స్వయ మతిశయ స్నిగ్ధో ముగ్ధే! ప్రియోఽయ ముపస్థితః.

14

బంధూక ద్యుతి బాంధవోఽయ మధరః స్నిగ్ధో మధూక చ్ఛవిః
గండశ్చండి! చకాస్తి నీల నళినీ శ్రీ మోచనం లోచనం,
నాసాభ్యేతి తిలప్రసూన పదవీం కుందాభదంతి! ప్రియే!
ప్రాయ స్త్వన్ముఖ సేవయా విజయతే విశ్వం స పుష్పాయుధః.

15

దృశౌ తవ మదాలసే వదన మిందు సందీపదం
గతి ర్జన మనోరమా విజితరంభ మూరు ద్వయం
రతి స్తవ కళావతీ రుచిర చిత్రలేఖే భ్రువా
అహో! విబుధ యౌవతం వహసి తన్వి! పృథ్వీ గతా.

16

సప్రీతిం తనుతాం హరిః కువలయాపీడేన సార్ధం రణే
రాధా పీన పయోధర స్మరణకృ త్కుంభేన సంభేదవాన్
యత్ర స్విద్యతి మీలతీ క్షణమపి క్షిప్రం తదాలోకన
వ్యామోహేన జితం జితం జిత మభూత్ కంసస్య కోలాహలః.

ఇతి శ్రీ జయదేవకవి కృతౌ గీతగోవిందకావ్యే
మానినీవర్ణనే చతుర చతుర్భుజో నాను
దశమ స్సర్గః

13

తరుణీ! మౌనము లేలనే కలిగెనే తాపంబెదన్ - బంచమ
స్వరముల్ జిందఁగ దీయఁగా బలుకవే - వైముఖ్యమున్ వీడవే -
కరుణన్ వీడకె నన్నుఁ - జూడ గదవే - కాంతా! యిదే నీ పిృయుం
డరయన్ నీ దరిఁజేరెఁ దానె యనురాగాయత్త చిత్తంబునన్

14

వనితా! మంకెన బోలు నీ పెదవి నవ్యంబై — మధూక చ్ఛవిన్
దనరుం జెక్కిలి — కుందదఁతి! నయన ద్వంద్వంబు చీకొట్టు న
ల్లనిదౌ కల్వల కాంతి - నువ్వుపువు లీలన్ గేరు నీ నాస — ప
చ్చని విల్కాఁడు భజించి నీ ముఖము విశ్వంబున్ జయించున్ సుమా!

15

కనులు 'మదాలస'ంబులు — ముఖం బది 'ఇందుమతీ' విలాస నం
దనము — 'మనోరమ'ంబు గమనంబును — వంచిత 'రంభ' లూరు లిం
తి నవ 'కళావతీ' యుతము నీరతి — చిత్రిత 'చిత్రలేఖ' దీ
పనములు కన్బొమల్ — భళిరె స్వర్గలతాంగుల దాల్తు విద్ధరన్.

16

కరిరాజున్ రణభూమిలో నెదురు నా కాలంబునన్ రాధికా
పరితుంగ స్తనకుంభయుగ్మము మదిన్ భాసింప శృంగార సం
స్ఫురణన్ మేనుజెమర్ప, మూయఁగనుదమ్ముల్ భ్రాంతిఁగంసుండఃహో
హరినేడోడె ననంగ వెల్గు హరి నిత్యామోదముల్ గూర్చుతన్.

ఇది గీత గోవిందకావ్య మందు
చతుర చతుర్భుజ మను
దశమ సర్గము.

— ఏకాదశ మ సర్గః —

— సానంద దామోదరః —

1

సుచిర మనునయేన ప్రీణయిత్వా మృగాక్షీం
గతవతి కృతవేశే కేశవే మంజు శయ్యాం,
రచిత రుచిర భూషాం దృష్టిమోషే ప్రదోషే
స్ఫురతి నిరవసాదాం కాపి రాధాం జగాద.

అ ష్ట ప దీ — 20

2

విరచిత చాటువచన రచనం, చరణే రచిత ప్రణిపాతం
సంప్రతి మంజుల వంజుల సీమని కేళి శయన మనుయాతమ్,
ముగ్ధే! మధుమథనం
అనుగత మనుసర రాధే!........ ధ్రువమ్.

3

ఘన జఘన స్తన భారభరే! దర
మంథర చరణ విహారం,
ముఖరిత మణి మంజీర ముపైహి వి —
ధేహి మరాళ నికారమ్ ........ ముగ్ధే.

4

శృణు రమణీయతరం తరుణీ జన
మోహన మధురిపు రావ .
కుసుమ శరాసన శాసన బందిని
పికనికరే భజ భావమ్........ ముగ్ధే.... .

– ఏ కా ద శ స ర్గ ము –

– సానంద దామోదరము –

1

అతివ నెంతయు హరి యిట్టు లనునయించి
సంతసము గూర్చి పొదరింటి శయ్యఁజేర,
తరుణి రతియోగ్య వేషంబు దాల్చియుండఁ,
గని నిశీథిని జెలి యిట్టు లని వచించు.

అ ష్ట ప ది – 20

2

పలికె నెన్నియొ ప్రేమవాక్కులు
వాలె నెంతయు పాదముల కడ
కుంజమున సుమశయ్య మన్న ము
కుందుఁ జేరఁ గదె.?

3

అతి ఘన స్తన జఘన ! మెల్లగ
నడుగులుంచుచు – గల్లు గల్లన
నందియలు – దలవంచ హంసలు
హరిని జేరఁగదె.

4

వినుము తరుణీమోహ మధురిపు
వేణుగానం బెంతయును – కనుఁ
గొనుము మన్మథు నాజ్ఞ జాతే
కోయిలల గుంపు.

5

అనిల తరళ కిసలయ నికరేణ క -
రేణ లతా నికురంబం
ప్రేరణ మిన కరభోరు! కరోతి గ
తిం ప్రతి ముంచ విలంబమ్........ ముగ్ధే....

6

స్ఫురిత మనంగ తరంగ వశాదివ
సూచిత హరిపరిరంభం,
పృచ్ఛ మనోహర హార విమల జల –
ధార మముం కుచకుంభమ్........ ముగ్ధే....

7

అధిగత మఖిల సఖీభి రిదం తవ
వపు రపి రతిరణ సజ్జం
చండి! రసిత రసనారవ డిండిమ
మభిసర సరస మలజ్జమ్ ........ ముగ్ధే ....

8

స్మర శర సుభగ నఖేన సఖీ మవ –
లంబ్య కరేణ సలీలం
చల వలయ క్వణితై రవబోధయ
హరి మపి నిగదిత శీలమ్........ ముగ్ధే.....

[ శ్రీ జయదేవ భణిత మధరీకృత, హార ముదాసిత వామం
హరి వినిహిత మనసా మధితిష్ఠతు. కంఠతతీ మవిరామమ్ ]

5

గాని కూగెడు చిగురుఁ జేతులఁ
గలికి ! తీగలు నిన్ను ప్రోత్సా
హించు - నేల విలంబనము, కా
నిమ్ము పయనమ్ము.

6

రత్న హారము లనెడు జలధా
రలను గల్గిన స్తనకలశములు
స్మర వశంబున పొంగుచును హరి
సంగమము దెల్పు.

7

తెలియు జెలులకు నీదు దేహము
చెలియ ! రతిరణ సిద్ధమని – మో
గంగ రశనా డిండిమము జే
రంగదే హరిని.

8

కామ శర సుందర నఖాంచిత
కరములం జెలి నూతఁగాఁ గొని
కదలు. వలయధ్వనుల నీ రా –
కను దెలుపు హరికి.

9

అక్ష్ణో ర్నిక్షిప దంజనం శ్రవణయో స్తాపిచ్ఛ గుచ్ఛావళీం
మూర్ధ్ని శ్యామ సరోజదామ కుచయోః కస్తూరికా పత్రకం
ధూర్తానా మభిసార సంభ్రమ జుషాం విష్వ జ్నికుంజే సఖి :
ధ్వాంతం నీలనిచోళచారు సుదృశాం ప్రత్యంగ మాలింగతి.

10

కాశ్మీర గౌర వపుషా మభిసారికానా
మాబద్ధరేఖ మభితో రుచి మంజరీభిః
ఏత త్తమాల దళ నీల తమం తమిస్రం
తత్ప్రేమ హేమ నికషోపలతాం తనోతి.

11

హారావళీ తరళ కాంచన కాంచి దామ
కేయూర కంకణ మణిద్యుతి దీపితస్య
ద్వారే నికుంజ నిలయస్య హరిం నిరీక్ష్య
వ్రీడావతీ మథ సఖీ మియ మిత్యువాచ.

అ ష్ట ప దీ – 21

12

మంజుతర కుంజతల కేళిసదనే
విలస రతిరభస హసిత వదనే ;
ప్రవిశ రాధే !
మాధవ సమీప మిహ ........ ధ్రువమ్.

9

వనితా ! కానుగుపూలు వీనుల – శిరోభాగంబునం గల్వలున్ –
గనులం గాటుక - నించుచున్ స్తనములం గస్తూరికా రేఖ – న
ల్లనిదౌ దుప్పటి వోలెఁ గుంజముల శ్రీలం జేర సంకేత భూ
మిని ప్రత్యంగము కౌఁగిలించు గద సంప్రీతిన్ దమం బెంతయున్.

10

అతివ ! కాశ్మీర గౌరదేహలఁ - బ్రియాభి
సారికల జుట్టు కాంతి సంచయ నిబద్ధ
రేఖ, జిత తమాల మగు రాత్రి, హరిప్రేమ
హేమ నికషోపలంబయి యెసఁగు చుండె

11

హారములు కాంచిదామ కేయూరములును
గంకణమ్ములు మిక్కిలి గాంతి కురియ
వెలుఁగు, పొదరింటి వాకిట విభుని గాంచి
సిగ్గువడుచున్న రాధతో జెలియ పలుకు.

అ ష్ట ప ది – 21

12

రతిహర్ష హసితమై రంజిల్లు వదన
పద్మంబు గలదాన! పద్మాక్షుఁ జేరి
లలిత వంజుల కుంజతల కేళిసదన
మందు నానందంబు నందంగ రమ్మి.

13

నవ భవ దశోక
దళ శయన సారే!
విలస కుచకలశ
తరళ హారే! ........ ప్రవిశ.

14

కుసుమ చయ రచిత
శుచి వాసగేహే,
ఇహ విలస కుసుమ సుకు –
మారదేహే !........ ప్రవిశ.

15

మృదు చల మలయపవన
సురభి శీతే,
విలస మదన శర
నికర భీతే ! ........ ప్రవిశ,

16

వితత బహువల్లి నవ
పల్లవ ఘనే,
విలస చిర మలస
పీన జఘనే! ........ ప్రవిశ

13

ముత్యాల హారాలు మురిసి నర్తించు
పసిఁడి కుండల వంటి పాలిండ్లదాన ?
హరిఁ జేరి రాధ ! నవ్యాశోక కుసుమ
మంజు శయ్యను బొందుమా విలాసములు.

14

పుష్ప సుకుమారమై పొలుపొంది మిగుల
రమణీయ మగు శరీరము గల్గుదాన !
సుమ సమూహమ్మున శుచియైన శయ్య
గల వాసగృహమునః విలసింపు మింక.

15

మించి మన్మథమూర్తి పంచబాణాలు
ములుకులై సోకంగ మూర్ఛిల్లుదాన !
మందంబుగా వీచు మలయ వాయువులఁ
బరిమళించు గృహానఁ బరవశంబందు.

16

అతి పీన మలస మత్యంత భారమ్ము
నగు జఘనంబుచే నలరెడుదాన !
వివిధ కోమల వల్లి నవ పల్లవముల
రాణించు పొదరింట రంజిల్లు మతివ !

17

మధు ముదిత మధుప కుల
కలిత రావే,
విలస కుసుమ శర
సరస భావే ః ........ ప్రవిశ.

18

మధురతర పికనికర
నినద ముఖరే.
ఇహ విలస దశన రుచి
రుచిర శిఖరే ! ........ ప్రవిశ.

[ విహిత పద్మావతీ సుఖ సమాజే,
భణతి జయదేవ కవిరాజరాజే ]

19

త్వాం చిత్తేన చిరం వహ న్నయ మతి శ్రాంతో భృశం తాపితః
కందర్పేణ చ పాతు మిచ్ఛతి సుధా సంబాధ బింబాధరం
అస్యాంకం తదలంకురు క్షణ మిహ భ్రూక్షేపలక్ష్మీలవ
క్రీతే దాస ఇవోపసేవిత పదాంభోజే కుత స్సంభ్రమః.

20

సా ససాధ్వస సానందం
గోవిందే లోలలోచనా.
శింజాన మంజు మంజీరం
ప్రవివే శాభివేశనమ్.

17

శృంగార రసముచే పొంగారుచున్న
మధురమౌ భావ సంపద గల్గుదాన !
మధువాని శబ్దించు మధుప సంచయము
వెలయు నీ పొదరింట విహరింపు మింక.

18

ధవళకాంతులచేత తళతళలాడు
పలువరుసను గల్గి విలసిల్లుదాన !
శుక పిక నికర గీతికలు జెన్నొంద
మార్మ్రోగు పొదరింట మగువ! క్రీడింపు.

19

మనసున నిన్నుమోసి, యతిమాత్రము మారుశరాళి చేత ద
స్సెను గడుఁ - ద్రావఁ గోరు సుధఁ జిందెడి నీ యధరోష్ఠబింబమున్
వనిత ! వసింపు మింక తొడపై - భయమేలిటు – త్వత్కటాక్షవీ
క్షణముల దాసుఁడై చరణ కంజ యుగంబు భజించు చుండఁగన్

20

అంత హరిణాక్షి కమలాక్షు నరయ, స్వాంత
మున భయమ్మును సంతోషమును జలింప
మంజు మంజీర శింజాన మధుర గతిని
కేళిగృహమున మెల్లన గాలుమోపె

## అష్టపదీ — 22

21, 22

రాధా వదన విలోకన వికసిత
వివిధ వికార విభంగం
జలనిధి మివ విధు మండల దర్శన
తరళిత తుంగ తరంగమ్,
హరిమేకరసం చిరమభిలషిత విలాసం
సా దదర్శ గురుహర్ష వశంవద
వదన మనంగ నివాసమ్ ......... ధ్రువమ్.

23

హార మమలతర తార మురసి దధ.
తం పరిరభ్య విదూరం,
స్ఫుటతర ఫేన కదంబ కదంబిత
మివ యమునా జల పూరమ్ ......... హరి.

24

శ్యామల మృదుల కళేవర మండల
మధిగత గౌర దుకూలం,
నీల నళిన మివ పీత పరాగ ప —
టల భర వలయిత మూలమ్ ......... హరి.

అష్టపదీ – 22

21

కాంచెఁ దన రాకకై నిరీక్షించు వాని
నగణిత మనోరథంబుల నలరు వాని
హర్ష వికసిత వదనాబ్జుఁ డైన వాని
హరిని భావజ మోహనుండైన వాని.

22

రాధికా ముఖచంద్ర దర్శన వికసిత
బహువిధ వికార లలిత భావముల వాని
చంద్రమండల దర్శన చలిత తుంగ
భంగ యుత జలనిధి వలె పొంగు వాని.

23

స్వచ్ఛతర తార హారాలు – వక్షమందు
వెలయు చుండఁగ, స్ఫుటతర ఫేన నిచయ
కలిత మైనట్టి కాళిందికా నదీ ప్ర -
వాహ సాదృశ్యమును బొంది పఱఁగు వాని.

24

అధిక కోమల శ్యామలంబైనదేహ
మందు గౌర దుకూలంబు చిందఁ గాంతి,
వితత పీత పరాగ సంస్పృత మూల
నీల నళినంబుతో సరిబోలు వాని.

25

తరళ దృగంచల చలన మనోహర
వదన జనిత రతిరాగం
స్ఫుట కమలోదర ఖేలిత ఖంజన
యుగ మివ శరది తటాగమ్........ హరి.

26

వదన కమల పరిశీలన మిళిత
మిహిర సమ కుండల శోభం,
స్మిత రుచి రుచిర సముల్లసితాధర
పల్లవ కృత రతిలోభమ్ ........ హరి.

27

శశి కిరణ చ్ఛురితోదర జలధర
సుందర సకుసుమకేశం,
తిమిరోదిత, విధు మండల నిర్మల
మలయజ తిలక నివేశమ్ ........ హరి.

28

విపుల పులక భర దంతురితం రతి
కేళి కలాభి రధీరం
మణి గణ కిరణ సమూహ సముజ్జ్వల
భూషణ సుభగ శరీరమ్ ........ హరి.

25

చంచల దృగంచల చలన సరస వదన
జనిత రతి స్తకుఁడై, శరత్సమయ భిన్న
కమల విమలోదర విహార ఖంజనయుగ
యుక్త కాసారముగ వెల్గుచున్న వాని.

26

లలిత వదన కమలము నలంకరించు
సూర్యులను కుండలమ్ముల సొబగు జిందు
వాని, మృదు మధురాధర పల్లవమున
వెలయఁ జిఱునవ్వు రతికాంక్షఁ దెలుపువాని.

27

శశికిరణ విస్ఫుటోదర జలదము వలె
సుమచయంబున వెలుఁగు కేశముల వాని,
తిమిర సంజాత విధుమండలము విధాన
గంధపుఁ జుక్క నుదుటను గలుగువాని.

28

విపుల పులక భరంబున వెలయువాని
రతికళా భావలోల ధైర్యంబువాని,
మణి గణ కిరణ నికర సంభావ్య భూష
ణాళి విలసిల్లు సుభగదేహంబు వాని.

[ శ్రీ జయదేన భణిత విభవ ద్విగుణీకృత భూషణ భారం
ప్రణమత హృదివినిధాయ హరిం, సుచిరం సుకృతోదయ సారమ్ ]

29

అతిక్రమ్యాపాంగం శ్రవణపథ పర్యంత గమన
ప్రయాసేనేవాక్ష్ణో స్తరళతర తారం గమితయోః,
ఇదానీం రాధాయాః ప్రియతమ సమాయాత సమయే
పపాత స్వేదాంబుప్రసర ఇవ హర్షాశ్రునికరః.

30

భజంత్యా స్తల్పాంతం కృత కపట కండూతి పిహిత –
స్మితం యాతే గేహా ద్బహి రవహితాళీ పరిజనే,
ప్రియాస్యం పశ్యంత్యాః స్మర పరవశాకూత సుభగం
సలజ్జా లజ్జాఽపి వ్యగమ దివ దూరం మృగదృశః.

31

సానందం నందసూను ర్దిశతు మితపరం సంమదం మంద మందం
రాధా మాధాయ బాహ్వో ర్వివర మనుదృఢం పీడయన్ ప్రీతియోగాత్
తుంగౌ తస్యా ఉరోజా వతను వరతనోర్నిర్గతౌ మా స్మ భూతాం
పృష్ఠం నిర్భిద్య తస్మా ద్బహిరితి వలిత గ్రీవ మాలోకయన్ వః.

29

పడఁతి నేత్రముల్ గడఁగంటిఁ గడచిచెవుల
వఱకు సాగిన యలసట వలననేమొ ?
ప్రియుని బ్రియమార వీక్షించు వేళయందు
జారె హర్షాశ్రువులు ఘర్మజలము వోలె.

30

అరుగఁ జెలికత్తె లందఱుఁ జిఱునగవును
గప్పి కృత్రిమ కండూతి కారణమున
స్మరవశాకూత సుభగుని హరిని జూచె
నారి, సిగ్గును సిగ్గుచే దూర మేఁగ.

31

రమజిన్ సందిటఁ జేర్చిమెల్లఁగ. గడున్ రాగంబు పొంగార వ
క్షమునన్ గట్టిగ హత్తుచుం "గఠిన తుంగ స్ఫారవక్షోజ యు
గ్మము నా వీపును జీల్చి వెల్వడుదుగా గాఢంబుగా" నంచుఁ గం
ఠము వేగంబునఁ ద్రిప్పు నందసుతుఁ డానందంబు మీ కిచ్చుతన్.

32

జయశ్రీ విన్యస్తై ర్మహిత ఇవ మందార కుసుమైః
స్వయం సిందూరేణ ద్విపరణముదా ముద్రిత ఇవ.
భుజా పీడ క్రీడా హత కువలయాపీడ కరిణః
ప్రకీర్ణాసృగ్బిందు ర్జయతి భుజదండో మురజితః.

23

సౌందర్యైక నిధే రనంగలలనా లావణ్య లీలా జుషః
రాధాయా హృదిపల్వలే మనసిజ క్రీడైక రంగస్థలే,
రమ్యోరోజ సరోజ ఖేలన రసిత్వా దాత్మనః ఖ్యాపయన్
ధ్యాతు ర్మానసరాజహంసనిభతాం దేయాన్ ముకుందో ముదమ్.

ఇతి శ్రీ జయదేవకవికృతౌ గీతగోవిందకావ్యే
రాధికామిళనే సానంద దామోదరో నామ
ఏకాదశ స్సర్గః

32

పారము లేని హర్ష రస బంధురయై జయలక్ష్మి, పూజ మం
దార సుమాల సల్పినటు – తానె గజంబును గెల్వఁ బ్రీతి సిం
దూరపు ముద్రఁ దాల్చినటు – ధూ_ర్తమదేభ వధంబునం దసృ
గ్వారి పరీతమైన హరి బాహుయుగం బది వెల్గు నెంతయున్

33

రమణీయ ప్రణిధాన, మంగజసతీ రమ్యైక లీలాజుషం
బమరన్, గామ కళా విలాస నిలయంబౌ రాధికా హృ_త్తటా
కమునన్ గ్రమ కుచాబ్జ ఖేలన పరా కర్మిష్ఠియై భక్తలో
కమణీ మానస హంసమై వెలఁగు శ్రీకాంతుండు మిమ్మేలుతన్.

ఇది గీతగోవిందకావ్య మందు
సానందదామోదర మను
ఏకాదశ సర్గము.

— ద్వాదశః సర్గః —

— సుప్రీత పీతాంబరః —

1

గతవతి సఖీబృందేఽమంద త్రపాభర నిర్భర
స్మరపరవశాకూత స్మిత స్మిత స్నపితాధరాం
సరసమనసం దృష్ట్వా రాధాం ముహు ర్నవపల్లవ
ప్రసవశయనే నిక్షిప్తాక్షీ మువాచ హరిః ప్రియామ్.

అష్టపదీ — 23

2

కిసలయ శయనతలే కురుకామిని ! చరణ నళినవినివేశం
తవ పదపల్లవ వైరి పరాభవ, మిద మనుభవతు సువేశం.
క్షణ మధునా నారాయణం
అనుగత మనుసర రాధే ! ........ ధ్రువమ్.

3

కరకమలేన కరోమి చరణ మహ
మాగమితాసి విదూరం,
క్షణముపకురు శయనోపరి మామివ
నూపుర మనుగత శూరమ్ ........ క్షణమధునా.

4

వదన సుధానిధి గళిత మమృత మివ
రచయ వచన మనుకూలం,
విరహ మివాపనయామి పయోధర
రోధక మురసి దుకూలమ్ ........ క్షణమధునా.

## — ద్వాదశసర్గము —

## — సుప్రీత పీతాంబరము —

1

వెడలఁ జెలికత్తె లందఱు, పెదవి మీఁద
చిఱునగువు చింద, మదన సంస్ఫురిత భావ
కలితయై సుమశయ్యను గాంచుచున్న
రాధతో బల్కె ప్రియమున మాధవుండు.

2

చిగురు టాకుల పాన్పున మగువ! పాద
పద్మముల నిడు, నీ పాదపల్లవముల
వైరమూను పొందుత పరాభవము, నిన్నుఁ
గోరు నారాయణుని నన్ను జేరు మిపుడు.

3

రమణి! యేతెంచినావు దూరమ్ము నుండి
పాయఁగా శ్రమనొత్తెదఁ బాదములను,
అతివ! నావలె నిన్ను వెంటాడు నూరు
లైన నందెల శయ్యపై నాదరింపు.

24

వదనశశినుండి సుధ జాలువాఱు రీతి
పల్కులను జిల్కవే చాన! ప్రబలుచున్న
గుబ్బల సమృద్ధి నడ్డు దుకూల మిపుడు
విరహమును బోలె దొలగింతు తరుణి! వేగ.

5

ప్రియ పరిరంభణ రభస వలిత మివ
పులకిత మతిదురవాపం,
మదురసి కుచకలశం వినివేశయ
శోషయ మనసిజ తాపమ్ ........ క్షణమధునా.

6

అధర సుధారస ముపనయ భామిని !
జీవయ మృతమివ దాసం,
త్వయి వినిహిత మనసం విరహానల
దగ్ధ వపుష మవిలాసమ్ ........ క్షణ మధునా.

7

శశిముఖి ! ముఖరయ మణిరశనాగుణ
మనుగుణ కంఠ నినాదం.
శ్రుతియుగళే పిక రుత వికలే మమ
శమయ చిరాదవసాదమ్ ........ క్షణమధునా.

8

మామతి విఫలరుషా వికలీకృత
మవలోకితు మధునేదం.
లజ్జిత మివ నయనం తవ విరమతి
సృజసి వృథా రతిఖేదమ్ ........ క్షణమధునా.

[ శ్రీ జయదేవ భణిత మిదమనుపద, నిగదిత మధురిపుమోదం,
జనయతు రసికజనేషు మనోరమ రతిరసభావ వినోదమ్ ]

5

ప్రియ పరీరంభణోత్సుక ప్రీతి వోలె
పులకితం బైన నీ కుచకలశయుగము
దొరకరానిది, దాని నా యురము పైన
నాన్చి మన్మథ సంతాప మణఁచు మింక.

6

ఉవిద ! యధరామృతంబు నా కొసఁగి మృతుని
చందమున బ్రదికింపు, నీ యందె డెంద
ముంచి విరహాగ్ని దగ్ధదేహుండ నయితి
నిర్విలాసుఁడ, దాసుఁడ నేడు దేవి !

7

శశిముఖీ ! నీ గళరుతికి సాటియైన
మణుల మొలనూలు మ్రోగింపుమా చిరంబు
పికరుతంబుల కెంతయు వికలములగు
చెవుల త్రుప్పు వదల్చి రంజింపు మిపుడు.

8

వ్యర్థ మగు కోపమును బూనినందు వలన
నన్ను గనుఁగొన లజ్జించుచున్నయట్లు
మూఁతవడు నీ కనుంగవ ముగ్ధ ! యేల
వృద్ధి జేసెదు రతిఖేద మీ విధమున.

9

ప్రత్యూహః పులకాంకురేణ నిబిడాశ్లేషే నిమేషేణ చ
క్రీడాకూత విలోకితేఽధర సుధాపానే కథాకేళిభిః,
ఆనందాధిగమేన మన్మథకళాయుద్ధేఽపి యస్మిన్నభూత్
ఉద్భూత స్స తయో ర్బభూవ సురతారంభః ప్రియంభావుకః.

10

దోర్భ్యాం సంయమితః పయోధరభరేణాపీడితః పాణిజై
రావిద్ధో దశనైః క్షతాధరపుటః శ్రోణీతటేనాహతః
హస్తేనానమితః కచేఽధర మధు స్యందేన సమ్మోహితః
కాంతః కామపి తృప్తిమాప తదహో । కామస్య వామాగతిః.

11

వామాంకే రతికేళిసంకుల సమారంభే తయా సాహస
ప్రాయం కాంతజయాయ కించి దుపరి ప్రారంభి యత్సంభ్రమాత్
నిష్పందా జఘనస్థలీ, శిథిలితా దోర్వల్లి, రుత్కంపితం
వక్షో, మీలితమక్షి, పౌరుషరసః స్త్రీణాం కుత స్సిద్ధ్యతి.

12

తస్యాః పాటల పాణిజాంకిత మురో, నిద్రాకషాయే దృశౌ,
నిర్ధూతాధరశోణిమా, విలులిత స్రస్తస్రజో మూర్ధజాః,
కాంచీదామ దరశ్లథాంచల మితి ప్రాత ర్నిఖాతై ర్దృశో
రేభిః కామశరై స్తదద్భుత మభూత్ ప్రత్యుర్మనః కీలితమ్.

9

బిగువౌ కౌఁగిలి అందు బుట్టు పులకల్ - వీక్షింపఁగాఁ బ్రేమ, సో
యగమౌ గన్నుల ఱెప్పపాటు — నధరం బాసక్తిమైఁ గ్రోలువే
ళఁగథల్ - మన్మథయుద్ధ మందు నధికోల్లాసంబు - విఘ్నాస్పదం
బగుచున్ రమ్యతరంబునై చెలఁగె రత్యారంభమున్ వారికిన్,

10

స్తనయుగ్మంబును మోపి ఱొమ్మునదిమెన్ — సంధించె దోర్వల్లి - మో
విని బల్గాటొనరించె — గోరుల గడుం బీడించె — శ్రోణీతటం
బున నెట్టెన్ - మరి మోవికల్లు నిడి సమ్మోహించె — జుట్టంది వం
చెను గానీ హరి తృప్తుఁడౌ — స్మరగతుల్ చిత్రంబు లెల్లప్పుడున్

11

రమణున్ గెల్వఁగ మన్మథాజిఁ బ్రియమారం దానె, వామాంకభా
గమునం దుండిన రాధ, పైసురతముం గావింపఁగా శ్రోణి స్త
బ్ధమయెన్. నిచ్చెను బాహుయుగ్మ. మదిరెన్ వక్షంబు, నేత్రాబ్జముల్
దమి మూతల్ వడెఁ, బౌరుషంబుఁగన గాంతల్ పొందఁగానేర్తురే ?

12

కనులున్ నిద్రనులేమి, ఱొమ్మను నఖాఘాతంబులన్ రక్తిమం
బునుబూనెన్, గడు మాసె మోవిరుచి కొప్పున్ వీడె — రాలెన్ బువుల్-
ఘనమౌ కాంచియు జారె - నిట్లుదయ కాలంబందనంగాస్త్రముల్
గనులన్ నాటఁగ శౌరిడెంద మది భగ్నంబయ్యెఁ జిత్రంబుగన్

13

వ్యాకోశః కేశపాశ స్తరళిత మలకైః స్వేదమోక్షౌ కపోలౌ
క్లిష్టా బింబాధరశ్రీః కుచకలశరుచా హారితా హారయష్టిః,
కాంచీకాంతి ర్హతాశా స్తనజఘనపదం పాణినాచ్ఛాద్య సద్యః
పశ్యంతీ సత్రపా సా తదపి విలులితా ముగ్ధకాంతి ర్ధినోతి.

14

ఈషన్మీలిత దృష్టి ముగ్ధవిలస త్సీత్కార ధారావశా
దవ్యక్తాకుల కేలికాకు వికస ద్దంతాంశు ధౌతాధరం,
శాంత స్తబ్ధ పయోధరం భృశపరిష్వంగా త్కురంగీదృశో
హర్షోత్కర్ష విముక్త నిస్సహతనో ర్ధన్యో ధయత్యాననమ్.

15

అథ సహసా సుప్రీతం
సురతాంతే సా నితాంత ఖిన్నాంగీ,
రాధా జగాద సాదర
మిద మానందేన గోవిందమ్.

అష్టపదీ – 24

16

కురు యదునందన ! చందన శిశిరతరేణ కరేణ పయోధరే
మృగమద పత్రక మత్ర మనోభవ మంగళకలశ సహోదరే
నిజగాద సా యదునందనే
క్రీడతి హృదయానందనే ........ ధ్రువమ్.

13

వీడెం గ్రొమ్ముడి - ముంగురుల్ గదలెఁ - బ్రస్వేదంబులై చెక్కులన్
వాడెన్ - మారెను మోని రంగు - సరఘున్ వక్షోజకుంభ స్థలిన్
గూడెన్ - కాంచిరుచుల్ లయించె - స్తనముల్ గోప్యాంగమున్ మూసిదా
జూడన్సాఁగెను ప్రేమతోడ హృదయేశుం డాత్మ నుప్పొంగగన్.

14

దరమీలన్నయనంబు - ముగ్ధతర సీత్కారంబునం దస్ఫుటా
క్షర రత్యుక్తి వికాసరమ్య రదన చ్ఛాయాధరంబున్ - లస
త్పరమామోద భరాలసాంగి చనుగుబ్బల్ పొంగు తీరంగ ని
బ్బరపుం గౌఁగిలియందు జేర్చి ముఖమాస్వాదించు ధన్యుండహో ?

15

అంత సురతాంత మందు నితాంతఖిన్న
లలిత మృదుల తనూలత కలిగి మిగులఁ
దరుణి సంప్రీతుఁడైన మాధవుని జూచి
యాదరానందముల తోడ ననియె నిట్లు.

అ ష్ట ప ది - 24

16

నందనందన ! చిత్రించు చందనమున
కంటె శీతలమైన నీ కరముతోడ
మదన మంగళ పూర్ణ కుంభముల చెలిమిఁ
బడయు కుచముల మృగమద పత్రకములు.

17

అళికుల గంజన మంజనకం రతి
నాయక సాయక మోచనే,
త్వదధర చుంబన లంబిత కజ్జల
ఉజ్జ్వలయ ప్రియ! లోచనే ........ నిజగాద.

18

నయనకురంగ తరంగ వికాసని –
రాసకరే శ్రుతిమండలే,
మనసిజపాశ విలాసధరే శుభ
వేశ! నివేశయ కుండలే ........ నిజగాద.

19

భ్రమరచయం రచయంత ముపరి
రుచిరం సుచిరం మమ సమ్ముఖే,
జితకమలే విమలే పరికర్మయ
నర్మజనక మలకం ముఖే ........ నిజగాద.

20

మృగమదరస వలితం లలితం కురు
తిలక మళిక రజనీకరే,
విహితకళంక కళం కమలానన!
విశ్రమిత శ్రమశీకరే ........ నిజగాద.

17

చెదరెఁ గాటుక పి్రియ! ముద్దు పెదవు లంటి
ముద్దుఁగొననీవు స్మరశరములను విడుచు
కన్నుదోయిని భ్రిమరనికాయ కాంతి
మించు నల్లనిగాటుక నుంచు మిప్డు.

18

రమణ ! నేత్ర కురంగ తరంగములకు
నడ్డమైనిల్చినవి ప్రసవాస్త్రి పాశ
లలిత సౌందర్య కాంతులు గలిగి నట్టి
చెవులఁ గుండల యుగమును జేర్చు కృష్ణ!

19

వారి జాతంబులను గ్రిందు పఱచి వెలుఁగు
నంద మగు మోముపై నడయాడుచుండెఁ
దేటిగుంపను భ్రాంతి సయ్యాటముగను
ముంగురులు — సవరింపు మో మోహనాంగ!

20

విశ్రమిత ఘర్మ శీకర విలసిత మగు
వదన రజనీకరుని యందు పద్మనయన!
జిత కళంకంబు, మృగమద చిహ్నితంబు,
నైన తిలకంబు నేర్పుమై నలదు మింక.

21

మమ రుచిరే చికురే కురు మానద !
మనసిజ ధ్వజ చామరే,
రతి గళితే లలితే కుసుమాని శి –
ఖండి శిఖండక డామరే, ........ నిజగాద.

22

సరస ఘనే జఘనే మమ శంబర
దారణ వారణ కందరే,
మణి రశనా వసనాభరణాని శు –
భాశయ ! వాసయ సుందరే; ........ నిజగాద.

[ శ్రీ జయదేవ వచసి రుచిరే సదయం హృదయం కురు మండనే,
హరి చరాణ స్మరణామృత నిర్మిత కలి కలుషజ్వర ఖండనే. ]

23

రచయ కుచయోశ్చిత్రం పత్రం కురుష్వ కపోలయోః
ఘటయ జఘనే కాంచీం ముగ్ధ స్రజం కబరీభరే,
కలయ వలయశ్రేణీం పాణౌ పదే కురు నూపురా
ఇతి నిగదితః ప్రీతః పీతాంబరోఽపి తథాఽకరోత్.

24

ఇత్థం కేళితతీ ర్విహృత్య యమునాకూలే సమం రాధయా
తద్రోమావలి మౌక్తికావలి యుగేవేణీభ్రమం బిభ్రతి,
తత్రాహ్లాది కుచప్రయాగ ఫలయో ర్లిప్సావతో ర్హస్తయోః
వ్యాపారాః పురుషోత్తమస్య దదతు స్ఫీతాం ముదం సంపదమ్.

21

మనసిజ పతాక రమ్య చామరము కృష్ణ!
సురత సమయ విగళితంబు సుందరంబు
శిఖి శిఖండక సదృశమై చెలఁగు నాదు
క్రొవ్వెదను క్రొవ్విరుల్ సమకూర్పు మిగుల

22

శంబరారాతి యను వారణంబు దిరుగు
కందరము – రమ్య శృంగార కంధరమ్ము
జఘన భాగంబు – నందు వస్త్రములు భూష
ణములు నుంచుము కృష్ణ! సౌందర్య మమర

23

స్తనములఁ బత్రరేఖలను – జక్కని చెక్కులఁ జిత్రరేఖలన్
ఘనము లిఖింపు – గాంచి జఘనంబున గూర్పుము - గొప్పునందు మా
లను ఘటియింపు – నూపురములం జరణంబులఁ – జేతులందు గం
కణముల నుంచుమన్న జెలి – గాంతుఁడు నట్టులఁజేసెఁ దృప్తుఁడై.

24

ఈ రీతిన్ విహరించుచున్ లలనతో తృప్తారియై, రాధ నూ
గారున్ మౌక్తికహారముల్ యమున గంగల్వోలెఁ జూపట్ట, నా
నీరంబందు ప్రయాగ సత్ఫల గతిం దేలంగఁ జన్గుబ్బ, ల
వ్వారిన్ వాని గ్రహించు శౌరి కరముల్ భాగ్యంబులం గూర్చుతన్.

ఇది గీత గోవింద కావ్యమందు
సుప్రీత పీతాంబర మను
ద్వాదశ సర్గము
గీత గోవిందకావ్యము సర్వము సమాప్తము.



[ యద్గంధర్వ కళాసు కౌశల మనుధ్యాయంచ యద్వైష్ణవం
యచ్ఛృంగార వివేకతత్త్వ రచనా కావ్యేషు లీలాయితం.
తత్సర్వం జయదేవ పండిత కవేః కృష్ణైకతానాత్మనః
సానందాః పరిశోధయంతు సుధియః శ్రీ గీత గోవిందతః.

శ్రీ భోజదేవ ప్రభవస్య రామాదేవి సుత శ్రీ జయదేవకస్య,
పరాశరాది ప్రియ వర్గకంఠే శ్రీ గీత గోవింద కవిత్వమస్తు.

సాధ్వీ మాధ్వీక ! చింతా న భవతి భవతః శర్కరే కర్కశాసి
ద్రాక్షే! ద్రక్ష్యంతి కే త్వా మమృత ! మృతమసి క్షీర ! నీరం రసస్తే.
మాకంద! క్రంద, కాంతాధర! ధర న తులాం గచ్ఛ యచ్ఛంతి భావం
యావ చ్ఛృంగారసారం శుభ మివ జయదేవస్య వైదగ్ధ్య వాచః ]

ఇతి శ్రీ జయదేవ కవికృతౌ గీత గోవిందకావ్యే
సుప్రీత పీతాంబరో నామ ద్వాదశ స్సర్గః
సమాప్తం చేదం కావ్యమ్,



